# విషయసూచిక



---

# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరఁదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మీ పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఏట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల మొదటి తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.

# శ్రీరామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారు చున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, తార్కికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమత సామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము : భక్తి : కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు : నీతి కథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డల కయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడి యున్నవి.

... ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలు, కీలకాలు చక్కగా అరటిపండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి...

—ఆంధ్రపత్రిక

... శ్రీ రామకృష్ణుని యుపదేశము లొక పండితమాత్రుని వాక్యములు కావు, అవి జీవితమను గ్రంథములోని పుటలు, స్వానుభవ నిదర్శనములు. కావుననే వానిని జదువునప్పుడు పాఠకునికి అనివార్యమగు చిత్త సంస్కారము గలుగుచుండును.

—గాంధి మహాత్ముడు

... మానవుని ఆత్మవికాస క్రమము ననుసరించి బోధ లిందు పొందు పరుపబడియున్నవి. ముఖ్యమగు తావులందు వేదశాస్త్ర ప్రమాణ వచనములు క్రోడీకరింపబడి గ్రంథ ప్రాశస్త్యమును ద్విగుణీకృత మొనర్చుచున్నవి.

—కృష్ణాపత్రిక

సర్వాంగ సుందరమగు చతుర్థముద్రణము !

540 పుటలు వెల : రూ. 3-4-0

---

ఇట్లు వ్రాయుడు :

శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి



శ్రీమత్ శంకరానందస్వాములవారు
శ్రీ రామకృష్ణమఠ సేవాసంఘ సర్వాధ్యక్షులు.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౯ { ౧౯౫౩ – జనవరి : : నందన – పుష్యము } సంచిక ౭

ఓం తత్ సత్

## శ్రీ శివపంచాక్షరీస్తోత్రమ్

శ్లో. ఓంకారసంజాత సమస్తవేద పురాణపుణ్యాగమపూజితాయ
చోంకారరూప ప్రియదర్శనాయ చోంకారరూపాయ నమశ్శివాయ! ౧

శ్లో. నానాజరావ్యాధి వినాశనాయ! నాథాయ లోకాయ! జగద్ధితాయ!
నానాకళాజ్ఞాననిదర్శనాయ! తస్మై నకారాయ! నమశ్శివాయ! ౨

శ్లో. మాత్సర్యదోషాంతక సంభవాయ! మాతుః పితు ర్దుఃఖనివారణాయ!
మహేశ్వరీ సూక్ష్మవరాయ! నిత్యం తస్మై మకారాయ! నమశ్శివాయ! ౩

శ్లో. శీలవ్రతజ్ఞాన దృఢవ్రతాయ! శీలాసువర్ణాయ! సముత్సుకాయ!
శీఘ్రానియత్యం సుర సేవితాయ! తస్మై శికారాయ నమశ్శివాయ! ౪

శ్లో. వామార్ధవిద్యుత్ప్రతిమప్రభాయ! వాచామనః కర్మవిమోచనాయ!
వాగీశ్వరీ సూక్ష్మపరాయ! నిత్యం తస్మై వకారాయ! నమశ్శివాయ! ౫

శ్లో. యక్షోరగేంద్రాది సురవ్రతాయ! యక్షాంగనా జన్మ విలోచనాయ!
యక్షేషు లోకేషు జగద్ధితాయ! తస్మై యకారాయ! నమశ్శివాయ! ౬

శ్లో. ఉత్ఫుల్ల నీలోత్పలలోచనాయై! కృశానుచంద్రార్క విలోచనాయ!
నిరీశ్వరాయై నిఖిలేశ్వరాయ! నమశ్శివాయైచ నమశ్శివాయ! ౭

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణ వచనామృతము —'మ.'

## దక్షిణేశ్వర దేవాలయమున అంతరంగభక్తులతో గురురూపి శ్రీ రామకృష్ణుడు

మంగళవారము,
18 డిశంబరు, 1883.

రామకృష్ణ గురుదేవు డెల్లప్పుడును సమాధిస్థితియందే నిమగ్నుడగుచుండెను రాఖాల్ మున్నగు భక్తులకు ఎట్టి శిక్షణ నొసగవలయును? వారి కెట్లు భగవచ్చైతన్యము కలిగింపవలయునన్న భావమే యెల్లప్పుడు ఆయన హృదయస్థమై యుండెను. ఆయన తన గది పడమటి వసారాయందు ప్రాతఃకాలమున గూర్చొనియుండెను. దేవేంద్రనాథఠాకూరు భక్తివైరాగ్యమును విని ఆయనను పొగడెను. రాఖాల్ మున్నగు యువకుల జూచి యిట్లు చెప్ప నారంభించెను: ఆయన మంచివాడు. కాని ఎవరు సంసారనిమగ్నులుగాక బాల్యము నుండియు శుకదేవునివలె దివారాత్రము భగవచ్చింతనము గావింతురో, ఎవరికి కౌమారము నుండియు వైరాగ్యము గలదో వారు ధన్యులు

సంసారులకు ఏదోఒకవిషయమునందు కోరిక యుండుచునేయుండును. దానితోబాటు భక్తియు నిండుగా గనిపించును. మథురబాబు ఒక్కొక్కప్పుడు ఒక దావాలో నుండును. ఆ సమయమున నతడు నన్ను జేరి 'బాబా నీవు కాళీ మాతకు అర్ఘ్యము నివేదింపుము' అని వేడుకొనును. సరే యని నేనును అట్లే యొనరింతును. నేను దేవికి అర్ఘ్యమిడుటయందతని కెంతటి విశ్వాసము!

రతి తల్లి ఎంతయో భక్తురాలు. ఎంతో సేవచేయుచుండెడిది. ఆమె వైష్ణవి. ఒకనాడు నేను కాళీదేవాలయమునందలి ప్రసాదమును గైకొనుట జూచినది. నాటినుండి యిచటికి వచ్చుటయే సంపూర్ణముగా మానివైచినది. ఆమె భక్తియంతయు సాక్షికము. ఎవరినిగాని చూచినంతలో సంపూర్ణముగా దెలియుట కష్టము.

శ్రీ రామకృష్ణ గురుదేవుడు తన గదియందు తూర్పువైపుననున్న గుమ్మమునెడ గూర్చొనియుండెను. అది శీతకాలము కావున ఆయన శరీరమంతయు (Moleskin) కంబళిచే కప్పబడియుండెను. హఠాత్తుగా సూర్యదర్శనమయినంతనే సమాధిస్థుడాయెను. నిమిషమాత్రమున బాహ్యజ్ఞానము పటాపంచలయ్యెను.

ఇదియేనా ఏమి! 'తత్సవితు వరేణ్యాం భర్గోదేవస్యధీమహి' అన్న గాయత్రీమంత్రము సార్థకత!

చాలకాలము తరువాత సమాధి భంగమాయెను. రాఖాల్, హజ్రా, 'మ.' వీరెల్లరు దగ్గర గూర్చొనియుండిరి.

శ్రీరామ:—(హజ్రాతో) సమాధి, భావావేశము—ఇవన్నియు నీశ్వరప్రేమకు జెందినవి, నిజమే. శ్యాంబజారునందు నటవర గోస్వామి యింట సంకీర్తన జరిగెను. శ్రీకృష్ణుడు, గోపికలు—వీరి దర్శనమయినంతనే సమాధిస్థుడనై పోయితిని. నా సూక్ష్మశరీరము శ్రీకృష్ణ చరణారవిందములకడ పడియున్నట్లు దోచినది.

జోరాసాంకోలో జరిగిన యొకానొక సంకీర్తనమునందు నయితము సమాధ్యవస్థనంది బాహ్యజ్ఞానము లేనివాడనయితిని. అపుడు దేహావసానము గూడ పరిణమింపగలయట్లుండెను.

శ్రీ రామకృష్ణ గురుదేవుడు స్నానమునకు వెళ్లెను, మరల వచ్చినపుడును ఆ గోపికల విషయమే మాటాడుచుండెను.

రాఖాల్ శ్రేయస్సుకొఱకు అచటి సిద్ధేశ్వరీ దేవికి పంచదారయు కొబ్బెర బొండమును శ్రీ గురుదేవుడు మ్రొక్కుకొనెను. 'మ.' ను జూచి, ఏమోయ్ దీని ఖరీదు నిచ్చెదవా యని యడిగెను.

సాయంతనము రాఖాల్, శ్రీ గురుదేవుడు, 'మ.' మున్నగువారు గుఱ్ఱపుబండి కట్టించుకొని సిద్ధేశ్వరి దేవళమునకు బయలుదేరిరి. దారి యందలి సిమూలియా బజారునందు పంచదారయు కొబ్బెర బొండమును గొనిరి. పిమ్మట దేవళమును జేరి కొబ్బరిబొండమును గొట్టి పంచదార వేసి దేవికి నివేదన చేయుడని భక్తులకు జెప్పెను. వీరు గుడి గుమ్మముదగ్గరకు వచ్చినంతనే గుడి పూజారులు గుడి తలుపులుమూసి ఎదుట 'పేకాట' ఆడుట వీరికి గనిపించెను. అంతట శ్రీ రామకృష్ణ గురుదేవుడు, 'చూచితిరా! వీరిచట గూర్చొని 'పేకాట' లాడుచున్నారు! ఇచ్చట భగవద్ధ్యానముగదా చేయవలసినది' అని పలికెను.

అచటినుండి శ్రీ గురుదేవుడు యదుమల్లికు నింటికి వచ్చిచేరెను. అతడు కొందరు ఇచ్చకులతో కలిసి కూర్చొనియుండెను. ఎదుట శ్రీ గురుదేవుని జూడగనే 'రా, రా ఎట్లున్నారు' అని కుశలప్రశ్నము లడిగెను. ఆ పిమ్మట శ్రీ గురుదేవుడు 'నీవెందుకీ యిచ్చకులను దగ్గర జేర్చుకొనుచుందువు?

యదు:—(నవ్వుచు) వారందరిని నీవుద్ధరింతువనియే. (అందరు నవ్విరి.)

శ్రీరామ:—ఇట్లు ముఖస్తుతి చేయువారెల్లరు బాబుగారిదగ్గరనుండి ధనము గడింప వచ్చుననుకొందురు. కాని బాబుదగ్గరినుండి డబ్బు సంపాదించుట మిక్కిలి కష్టము. ఒక నక్క ఆబోతును జేరి దానిని విడువక వెంబడించుచుండెను. అది మేయునపు డిదియు దాని దగ్గరనే యుండెడిది. నక్క తనలో నిట్లు తలంచెను: 'వ్రేలాడుచున్న దీని అండకోశ మెపుడో త్రెగి పడును. అపుడు దానిని నేను తినగలను.' అట్లు తలంచి ఆబోతు ఎందైన నిదురించుచున్నచో నిదియు నందే పరుండి నిద్రించెడిది. అది లేచి మేతకు బోయినపుడు నక్కయు దానిని వెంబడించెడిది. ఇట్లెన్నియో దినములు గడచినవి. కాని ఆ అండకోశము పడ లేదు. చివరకు విసిగి నిరాశజెంది నక్క వెడలిపోయెను. (అందరు గొల్లున నవ్విరి.) ఇచ్చకములాడువారి యవస్థయు నిట్టిదే.

# శ్రీ వివేకానంద స్మృతి

[భగవంతుని నెవరును జూపనేరరు. ఆ భగవద్దర్శనము ఇంద్రియగోచరము కానిదగుటయే యిందులకు గల ప్రబలకారణము. కాని భగవత్సాక్షాత్కారము నందినవారిని మన మపుడపుడు జూడవచ్చును. వారి ఆధ్యాత్మికజీవనము, ప్రపంచమున వారు వ్యవహరించు రీతి—వీనినిబట్టి వారు భగవత్సాక్షాత్కారభాగ్యము బడసినవారని మనము తెలిసికొనవచ్చును. ఇటీవల భారత దేశమునం దవతరించిన మహాపురుషులలో శ్రీ వివేకానందులవా రొకరని సమస్త జగత్తు నెఱిగిన విషయము. ఆ మహానుభావునితో నెంత స్వల్పకాలము కలిసియున్నను ఎందరో తమ జీవిత మంతయును నిత్యనూతనము జేసికొని యున్నతస్థితికి రాగలిగిరి. అట్లు శ్రీ స్వామివారితో కలిసి కొను భాగ్యమును బడసి తమ జీవితమును సంపూర్ణముగ పవిత్రముజేసికొని జీవితాంతము (1949) వఱకు శ్రీవారి గుణకీర్తనము చేయుచుండిన జోసఫీన్ మెక్లౌడ్ (Josephine Macleod) ఇట్లు తన స్మృతిని వెల్లడించుచున్నది. ఈ స్మృతి పఠనమున శ్రీ స్వాములవారి మహత్త్వము, ఉదారస్వభావము అత్యద్భుతమును కూలంకషమునగు నైపుణ్యము తేటతెల్లము కాగలవు.

—సంపాదకులు.]

(గత సంచిక తరువాయి)

ఆ సంవత్సరము శరత్కాలమున స్విట్జర్లాండు దేశమును విడిచి సేవియర్ దంపతులతోను జే. జే. గుడ్విన్‌తోడను శ్రీ స్వాములవారు భారతదేశమునకు బయనమయిరి. అచ్చట శ్రీవారికి గొప్ప అభినందన సమర్పణార్థము తగు నేర్పాట్లు జరుగుచుండెను. ఈ సన్మానావసరముల శ్రీ స్వాములవా రుపన్యసించిన విషయమును మనము (Colombo to Almora) కొలంబోనుండి అల్మోరావఱకు అన్న గ్రంథమున గనుగొనగలము.

గుడ్విన్ మహాశయుడు శ్రీ స్వాములవారి యుపన్యాసములన్నింటిని (Stenograph) చేయు (వ్రాయు) చుండెను. అతడు Stenographersలో అత్యంతనిపుణుడు. అతడు న్యాయస్థానమునందు (Stenographing) పనిని నిర్వహించుచుండెడివాడు. నిమిషమునకు రెండువందల శబ్దములను వ్రాయ (చేయ) గలవాడు. అతనిని తనయొద్ద నుంచుకొన్నచో శ్రీ స్వాములవారి కెంతయో వ్యయమగుచుండెడిది. అయినను శ్రీవారి మాటలన్నియును ఎంతయో విలువ గలవి. కావున వానిని వదల్పరాదని యెంచి అతని నా కార్యమున నియోగించిరి.

గుడ్విన్ మహాశయుడు వారమురోజులపాటు పనిచేసి ఆ పిమ్మట 'నాకిక ధనమవసరములేదు' అని చెప్పెను. 'ఎందులకిట్లు చేయుచున్నా'వని యడుగగా 'శ్రీ స్వాములవారు తమ జీవితమునే త్యాగ మొనర్చుచున్నారు. అట్టి విషయమున నే నొసగగలిగినదన్ననో ఎంతయో తక్కువ పాటి సేవ. అదియును నీయజాలనా?' అతడు

శ్రీ స్వాములవారితో ప్రపంచము సమస్తమును దిరిగి వారి యుపన్యాసములన్నింటిని తూచ తప్పకుండ (Stenograph చేసి) వ్రాసి యుంచెను. ఆ యుపన్యాసములే నేడు మనకు లభించుచున్న 'సప్తసంపుటములు'.

శ్రీ స్వాములవారు భారతదేశమునకు బోయినపిమ్మట శ్రీవారినుండి యుత్తరము వచ్చునుగదాయని యెదురుచూచుచు నేనుత్తరము వ్రాయలేదు. చివరకు శ్రీవారియొద్దనుండియె నాకు లేఖ వచ్చినది. అందు 'ఏమియు వ్రాయుటలేదేమి?' యని ప్రశ్నించిరి. అటు తరువాత 'నేను భారతదేశమునకు వత్తునా?' యని లేఖాముఖమున ప్రశ్నించితిని. అందులకు శ్రీవారు 'ఇందలి మాలిన్యము, అవనతి, దారిద్ర్యము, కౌపీనధారులగు ధర్మప్రచారకులు— వీని నభిలషించినచో నీ విచటికి రావచ్చును. మరి ఇతరమేదియైన కావలసినచో నీవు రావలదు. మా దేశమునుగూర్చిన మరియొక విమర్శనము మా కక్కఱలేదు.' అని ప్రత్యుత్తర మిచ్చిరి.

వారు అన్నట్లు ఆతక్షణమే ప్ర ప్రథమ నౌకయందే నేను భారతదేశమునకు జనవరి 12 న పయనమయితిని. నాతోగూడ ఓలిబుల్ (Ole Bull), శ్రీ శారదానందస్వాములవారు— వీ రిరువురును వచ్చిరి. మేము లండనునదిగి ఆ పిమ్మట రోమునకు బయలుదేరితిమి. ఫిబ్రవరి 12 న బొంబాయి చేరితిమి. అచ్చట మమ్ము గలిసికొనుటకై చెన్నపురినుండి అళగసింగంగారు, వచ్చియుండిరి. వారి ముఖమున వైష్ణవ సాంప్రదాయ ప్రబోధకములగు నూర్ధ్వపుండ్రములు మెరయుచుండెను. కొంతకాలమునకు బిమ్మట నేను శ్రీ స్వాములవారితో కాశ్మీరమునకు బయనమయితిని. దారియందు శ్రీ స్వాములవారిని జూచి 'ఇదియేమిటి? ఇంకను అళగసింగంగారు వైష్ణవనామముల ధరించుచునే యున్నారు?' అంటిని. తోడనే శ్రీ స్వాములవారు మహాకోపముతో 'మరి మాట్లాడకు. ఇంతవఱకు నీవేమిచేసితివి?' అనిరి. నేనేమి చేసితినో నాకే తెలియదు. మరి నోరు తెఱవలేదనుటమాత్రము నిజము. నా కన్నుల నశ్రువులు గ్రమ్మినవి. ఇక జరుగగలదేమిటోయని అపేక్షించుచు గూర్చుంటిని. కొంతకాలమునకు తరువాత, అళగసింగంగారు బ్రాహ్మణ యువకులు; ఒకానొక కళాశాలయందు తత్త్వోపన్యాసకులుగా నున్నారని వింటిని. వారు తమ వందరూపాయల రాబడితో తల్లిదండ్రులను భార్యను నలువురు బిడ్డలను బోషించుచున్నారు. ఇట్టి క్లిష్టపరిస్థితియందున్నను ఆయనగారు ఇంటింటికిబోయి యాచించి శ్రీ స్వాములవారిని పాశ్చాత్యదేశములకు బంపు నేర్పాట్లు గావించిరి. వారే లేకపోయినచో శ్రీ వివేకానందుల గలిసికొను భాగ్యమే మాకు కలిగియుండెడిదిగాదు. అళగసింగంనిగుఱించిన నిష్ఠురవాక్య మొక్కటయినను శ్రీ స్వాములవారేల సహింపకుండిరో నాకిపుడు అవగాహన మయినది.

మేము బొంబాయి జేరగనే అచటివారం దరును అక్కడనే దిగవలసినదిగా ఎంతయో పట్టుపట్టిరి. కాని మేము కలకత్తాకు వెళ్లు మొట్టమొదటి బండియందే బయలుదేరి రెండవ రోజు తెల్లవారుఝామున నాలుగుగంటలకు కలకత్తా చేరితిమి. అచట శ్రీ స్వాములవారు రైలుస్టేషనునందు పది పండ్రెండుగురు శిష్యులతో మమ్ము గలిసికొనిరి. అదియునుగాక భారతదేశ ప్రముఖులు దాదాపు ఇరువదుగురు రంగురంగుల తలగుడ్డలతో నచటజేరియుండిరి.

వీరందరు అమెరికా దేశమునకు బోయినపుడు శ్రీమతి ఓలిబుల్ సతి (Mrs. Ole Bull) వీరందరకును ఆతిథ్యమొసగెను. వారందరును బోలెడు పూలహారములతో మమ్ము గప్పివైచిరి. పూలమాల వేసికొనుటయే నాకెంతో భయము. గత్యంతరములేక వానినన్నిటిని ధరించితిని. ఆ పిమ్మట నేనును ఓలిబుల్ సతియు హోటలున బసచేసితిమి. అక్కడకు మోహినీఛటర్జీవారు వచ్చి సాయంత్రము 5 మొదలు 10 గంటలవఱకు నుండిరి. వారంత కాలమున్నందులకు 'ఏమండీ! మీ రింత కాలమిచట నుండినందులకు మీ భార్య కలతనొందదా?' యని యడిగితిని. 'నేను వెళ్లి అంతయు మా తల్లితో వివరముగా జెప్పెదను' అని ఆయన బదులుపలికెను. ఈ పలుకులు విన్న నాకేమియు అర్థముకాలేదు. తరువాత కొన్నాళ్లకు ఆయనతో నెక్కుడు పరిచయమయిన పిదప నొకనాడు "ఏమండీ! మొట్టమొదటిరోజు 'అంతయు మాతల్లికి విశదముగా జెప్పెద' నంటిరిగదా! దాని యర్థమేమి?" యని యడిగితిని. ఆయన యిట్లు బదులుచెప్పెను: 'ప్రతిదినము నేను పడకకుబోవుటకుముందుగా మా తల్లిదగ్గరకుబోయి ఆ దినమంతయు నడిచిన విషయమును చెప్పి ఆపిదప పడకకు బోవుదును'. 'మరి మీ భార్యకో! ఆమె కేమియు జెప్పరా?' యని యడిగితిని. అందులకాయన 'నాభార్యా! ఇట్టి అంతరంగము ఆమెకు ఆమె కుమారునియొద్ద లభింపగలదు.' అని బదులు చెప్పెను. అప్పుడే భారతీయ నాగరికతకు పాశ్చాత్య నాగరికతకుగల భేదము నాకు సుస్పష్టమయ్యెను: భారత దేశనాగరికత మాతృత్వమునందును పాశ్చాత్యనాగరికత సతీత్వమునందును లగ్నమైయున్నట్లుగోచరించెను.

రెండు దినముల పిమ్మట శ్రీ స్వాముల వారు తాత్కాలికముగా నేర్పఱచుకొన్న మఠమునకు—నీలాంబరముఖర్జీవారి బంగళాకు—బోయితిమి. ఆనాటి సాయంకాలము స్వాములవారు 'నేడు నాతోరండు. క్రొత్తగా కొనదలచిన మఠమును జూపెదను'. అని పలికిరి. అంతట నేను 'ఇదియేమిటి స్వామిజీ, ఇది చాలదా మీకు?' అని యడిగితిని. నిజము; వారపుడున్న భవనము, రెండు ఎకరముల భూమయమయిన చిన్న బంగళా. అందు నట్టనడుమ నొక చక్కటికొలను, దాని చుట్టును పూలమొక్కలు శోభిల్లుచుండెను. అందువలన నది వారెల్లరకు సరిపోవునని తలంచితిని. కాని స్వాములవా రట్లు తలంపలేదు. వారు కోరిన పరిమాణము వేరొకరీతిగా నుండినది. అంతట వారితోగలిసి కొన్ని సందులుదాటి నేటి బేలూరు మఠావరణమును జేరితిమి. అంతట నదీతీరమున నీ చక్కని పురాతన భవనము ఖాళీగానుండుట జూచి నేనును ఓలిబుల్ సతియు 'ఏమి స్వామీజీ! మే మీయిల్లు వాడుకొనగూడదా?' యని యడిగితిమి. అది కాపురముచేయదగిన స్థితియందు లేదు.' అనిరి. 'మే మదియంతయు చక్కబఱచుకొందు' మని చెప్పగా వారు సమ్మతించిరి. వెంటనే మేము ఇల్లంతయు సున్నము బూయించి శుభ్రపఱచి వలసినసామగ్రిని తీసికొనివచ్చి ఆయింట సగము భాగమున నొక కొలువుకూటమునేర్పఱచి, సగము భాగము పాశ్చాత్యపద్ధతియందును సగపాలు భారతీయ పద్ధతియందును తయారుచేసితిమి. మా భోజనపుగది బయటనుండెడిది. ఆసమయమున మేము కాశ్మీరము వెళ్లువఱకు మాతోబాటు సోదరి నివేదిత కొన్నాళ్లు గడిపినందున ఆమెకును ఒక శయనాగారము వదలితిమి.

అప్పుడు మూడుమాసములు అచ్చట నుంటిమి. శ్రీ స్వాములవారితోబాటు ఆ సమయము నందువలె మరెప్పుడు నంతటి యానందమున మేము కాలము గడుపలేదు. శ్రీవారు ప్రతి దినము ఉదయమున 'టీ' పుచ్చుకొనుటకై యచటికి వచ్చెడివారు. అందుగల మామిడి చెట్టుక్రిందనే 'టీ' పుచ్చుకొనెడువారు. ఇప్పుడును ఆ చెట్టుగలదు. ఎందరో ఆ చెట్టును నఱికెద మన్నను మేము నఱకనీయలేదు. మేము ఆ నదీతీరమున నుండుట శ్రీవారికి ఎంతో సంతస మయినది. శ్రీవారు తమ్ముజూడవచ్చిన స్నేహితులందరను అచ్చటికి దోడ్కొనివచ్చు చుండెడివారు. కాపురమునకు వలనుపడని ఆ యింటిని మేమెట్లు చక్కబఱచి వాసయోగ్య ముగా మార్చితిమో తమ స్నేహితుల కెల్లరకును జూపవలయునని శ్రీవారి యభిలాష. ప్రతిదినము సాయంకాలము లందు నది కభిముఖముగ 'టీపార్టీలు' పెట్టెడి వారము. నదిలో పడవలో బోవునపు డా దృశ్యము ఆకర్షణీయముగా నుండెడిది. మేము సాధారణవస్తువులనుగూడ ప్రత్యేక విషయము లందు వినియోగించుటను జూచునపుడు శ్రీ స్వాములవారెంతయో ఆనందించెడివారు. ఒక నాటి రాత్రి హఠాత్తుగా పెద్ద వర్షముకురియ నారంభించినది. శ్రీ వారు మా భోజనాలగది వసారాయందు పచారుచేయుచు శ్రీ కృష్ణ ప్రేమనుగూర్చియు, కృష్ణభక్తినిగూర్చియు, ప్రపంచమున ప్రేమకుగల శక్తినిగూర్చియు మాట్లాడుచుండిరి. శ్రీ వారియం దత్యం తాద్భుతమగు గుణము ఒకటి కలదు. వారు ఒక భక్తుడుగా—ప్రేమికుడుగా—నుండిన వేళలయందు కర్మ, జ్ఞాన రాజయోగముల కా మూర్తియందు చోటుండెడిది కాదు. కేవలము పరిపూర్ణ భక్తుడుగా పరిణమించెడివారు. ఆ పిమ్మట కర్మయోగిగా మారినపుడు శ్రీవారు చెప్పెడి పలుకులన్నియు కర్మయోగమయము లయ్యెడివి. అట్లే జ్ఞానయోగిగా మారినపుడు కేవలజ్ఞానియే. ఒక్కొక్కప్పుడు కొన్ని వారములపాటు ఒక్కొక్క విధముగా నడుచుకొను చుండువారు. అప్పటి భావమునకును అమున్నప్పటివారి భావమునకును సంబంధ మణుమాత్రము నుండెడిది కాదు. వారికిగల ఏకాగ్రత ప్రపంచమున మరియెవరికి నున్నట్లె కనిపింపదు. అంతమాత్రమే కాక మన చుట్టునున్న ఆధ్యాత్మికశక్తిని రూపొందించు గుణమును శ్రీవారియందు భాసించెడిది. ఎల్లప్పుడు శ్రీవారియందుగోచరించుచుండిన నవనవోన్మేషమునకును, యౌవనమునకును, చూపులకును వారి ఏకాగ్రతయే కారణమని తలంచుచున్నాను. శ్రీవారి వాక్కులయందు పునరుక్తి గోచరింపదు. మనము అల్పవిషయమని తలంచు ప్రతిదియు శ్రీవారి గొప్పగొప్ప యుపదేశములకు మూలకారణమగుచుండెడిది. ఇందులకుదాహరణము: శ్రీవారు మమ్మెల్లరను 'వేదాంతాభ్యాసకు'లని వచించెడివారు. వారు చెప్పిన విషయమిది: "మీరందరును ఒక్కపరి ఒక్క విషయమును నమ్మినచో అది ఎప్పటికిని సత్యమేయని తలంచెడివారే కాని దానిని గూర్చి వేరు విధముగ కలలుగాంచెడివారు కారు."

(సశేషము)



# హరిదాసులు - పురందరులు

శ్రీ టి. యల్. నరసింహారావు, బి. ఎస్‌సి.

భక్తి సాంప్రదాయ మతి ప్రాచీనమైనది. భక్తిమార్గమే మోక్షరాజ్య సింహాసనమునకు రాజబాట. కర్ణాటక దేశమున చాలకాలము నుండియు బహుళ ప్రచారమున నుండినదీ మార్గమే. దక్షిణాదిని నుద్భవించిన భక్తి కర్ణాటకమున పెంపొందినది. ఇట్టి భక్తి మార్గమునకు పునాదులు పెట్టిన మహనీయుడు పురాణప్రసిద్ధుడు, హరిభక్తుడు నారదమహర్షి. తరువాతి దాసులు వీరి అనుయాయులు. సదా సీతారాముల పాదసేవయొనర్చి భక్త శ్రేష్ఠు డనిపించుకొని మోక్షపీఠము నధిష్ఠించినది శ్రీ ఆంజనేయస్వామి. ప్రాచీనఋషులు, బుద్ధభగవానులు, శంకరులు, వాయుదేవుని మూడవ యవతారమనియెడి శ్రీమన్మధ్వాచార్యులు, రామానుజులు, బసవాది ప్రమథులు, దేవారకర్తలు, ఆళ్వారులు, శివశరణులు, భక్తికి ముఖ్యస్థాన మొనగూర్చి మానవకోటికి ముక్తిమార్గమును జూపుటకై యవతరించిన కారణజన్ములు. మధ్వాచార్యులను గురువులుగా పరిగణించి వైష్ణవదాసకోటి కర్ణాటకమున భ ప్రచారము కావించినది. బంగాళ ప్రాంతమున అతిశయ ప్రసిద్ధుడగు చైతన్య ప్రభువు శ్రీ మధ్వాచార్యులనుండియే భక్తిభావమును గ్రహించిరని ఐతిహాసికుల నానుడువు. కర్ణాటకమున భక్తకోటికి భక్త వాఙ్మయమునకు అత్యంత శ్రేష్ఠస్థానమును కల్పించినది దాసశిరోమణి పురందరులు. వీరు కన్నడ భాషాసేవ అత్యంతముగా నొనర్చి సంగీతకళయం దాదరాభిమానములను పునరుద్ధరించిరి. భక్తిరసపూరితములై అసంఖ్యాకములగు ఉత్తమోత్తమ కీర్తనలను రచించిరి. తెలుగు వాగ్గేయకారకులలో అగ్రగణ్యుడైన త్యాగరాజున కీ పురందరకీర్తనలు స్ఫూర్తిని కల్గించినవి. ఒక్క త్యాగరాజేకాదు, దేశదేశముల యందు ఉత్తమ భక్తులు రామదాసు, తుకారాము మొదలగు దివ్యపురుషులు పురందరులను ఆదర్శముగా గొని, తమ యిష్టదైవములను సంకీర్తనములు గావించి అనుభావమార్గమున సిద్ధివడసి సంగీతశాస్త్రము భక్తి ప్రబోధకమనియు, ముక్తిదాయకమనియు ప్రపంచమునకు చాటిరి.

క్రీ॥ శ॥ 15, 16 శతాబ్దములమధ్య ఆధ్యాత్మిక మహావిప్లవమును కావించి ముముక్షువులకు భక్తిమార్గమున మోక్షభిక్షను ప్రసాదించిన ఒక దేశస్థబ్రాహ్మణుడు – పురందరులు. పురందరుని తండ్రి వరదప్ప యను బంగారు వెండినగల వర్తకుడు. పురందరుల పూర్వ నామధేయము కృష్ణప్పనాయకుడు. పూనా జిల్లాలో పురందరపుర పరిసరప్రాంతములనున్న పురందరఘడమనుగ్రామము వీరి జన్మస్థానము. కారణజన్ముడగు పురందరుడు నారదాంశమున జన్మించెనని చెప్పుదురు. పురందరుడు సంస్కృత

భాషయందే కాక సంగీతకళయందు, రత్న శాస్త్రమందు బహు నిపుణుడై బీజపూరు రాజులయొద్ద వర్తకుడుగా నుండెను. ధనాశా మోహితుడై ద్రవ్యార్జనా నిరతుడై విరివిగా ధనము నార్జించెను లక్ష్మీసంపన్నత పెరిగిన కొలది పురందరునకు లోభత్వముకూడ అభివృద్ధి నొందుచుండెను. ఇట్టి లోభమునకుతోడు భూతదయ భగవద్భక్తి లేక నాస్తికుడై ఇహపరయోచన లేక వ్యవహరించుచుండెను. ఈ యవివేకి భార్య సరస్వతీబాయి. సకల లక్షణ సంపన్నురాలు. నిరంతర పతిభక్తి పరాయణ సతత దివ్యకథాశ్రవణలాలస. వీరి సంసార నౌక భర్తచే నీ విధముగ మోహసాగరమున కీడ్చుచుండ భార్య అఖండ సచ్చిదానంద స్వరూపమైన మోక్షసామ్రాజ్యమునకు త్రిప్పుచుండెను. బుద్ధ్యదప్రాయమగు ఐహిక వాంఛలే తిరమనుకొని పురందరులు సంతసించుచుండెను. ఇట్టి వాని ధర్మమార్గ ప్రగతిని గల్గింప సంకల్పించి దారిద్ర్యముచే బీడింపబడుచున్న యొక వృద్ధ బ్రాహ్మణరూపమున పరమాత్ముడు పురందరునియొద్ద కేతెంచి తన కుమారున కుపనయనముచేయుటకు తగు ద్రవ్య సహాయ మొనర్పుమని యాచించెను. ధనమే ప్రాణసమానమగువారి హృదయము లెంత కఠినములు! నిర్దయాకోశ మయములు! పురందరుని మన సించుకైనను కరుగలేదు సరిగదా —ఆ వృద్ధుని పో పొమ్మని మొండాడెను. ఇది విని పురందరునిభార్య చింతాక్రాంతమై యా ముదుక బిచ్చగాని నెట్లైనను సత్కరించవలెనని కుతూహలపడుచుండెను. చేత నొక కాసు వీసమైనను లేక కడుంగడు కుంది రహస్యముగ తన రతనాల ముక్కుపుడక నా యాచకునకు దానమిచ్చెను. కపటవేషధారి యగు వృద్ధుడా ముక్కరను పురందరునకే విక్రయించి పనము తీసికొనిపోయెను. పురందరు డా యాభరణము తన భార్యదని గ్రహించి దానిని కడు భద్రముగా దాచి ఆ వృద్ధబ్రాహ్మణయాచకుని ఒక గదియందుంచి భార్యయొద్దకు పోయి ముక్కర నిమ్మనెను. ఇంతలో గదియందుంచిన బ్రాహ్మణు డదృశ్యుడాయెను. పురందరునకు కలవర మెక్కువాయెను. దిన దినము పురందరుడు ముక్కరను తే తెమ్మని భార్యను వేధించుచుండెను. ఆమెకు ఏమిచేయుటకు తోచక భర్త తన్ను తప్పక దండించునని భయ విహ్వలమై యుండెను. భర్త పెట్టు పోరున కోర్వజాలక ఆత్మహత్యకావింప నిశ్చయించుకొనెను. ఒకనాడు నిత్యపూజలు సల్పి కొని భగవంతుని ప్రార్థించి విషమును త్రాగుటకై విషపూరిత పాత్ర నెత్తునంతలో పైనుండి ఆ యాభరణమందు పడెను. కరుణాంతరంగుడు, భక్తజనపాలుడు తన భక్తురాలి నాత్మహత్య కావించుకొననిచ్చునా! ఆశ్రిత జనరక్షకుడగు పాండురంగని కొండాడుచు భర్త కడకుపోయి తన ముక్కుపుడకనిచ్చి భర్తను కడు విస్మయ మందించెను.

పురందరునియం దాధ్యాత్మిక పరివర్తన ప్రారంభమాయెను అజ్ఞానాంధకార మంతరించి పురందరునియందు జ్ఞానోదయ మారంభమాయెను. వృద్ధరూపమునవచ్చి తనను యాచించినది పాండురంగడేయని తెలిసికొనకల్గెను. తన భార్యకులభించిన భాగ్యము తనకు లభింపలేదని వాపోవ నారంభించెను. తన లోభత్వమునకు మిక్కిలి చింతించెను. తన యనర్థములకు ఐశ్వర్యమదమే కారణమని గ్రహించి తన వ్యాపారమును కట్టిపెట్టి భిక్షాటనచేయుచు దివ్యనామస్మరణతో జీవితమును

గడపుచుండెను. పాండురంగడు కన్పించనిచో ప్రాణత్యాగము చేయుటకు దీక్షాకంకణము గట్టికొని దేహాభిమానమునువీడి నిత్యము నారాయణ నామస్మరణ చేయుచుండెను. వ్యాసరాయలను గురువుగా స్వీకరించి పురందర విఠలుని కీర్తించుచు లక్షలాది కృతులను రచించెను. కామ మత్సరాదులను వీడి వైరాగ్యమును బూనెను. పురందరులు తమ అనుభావమార్గమున లోకమునకు చాటిన అద్భుతచర్య లనేకములను లోకులు చెప్పికొందురు. ఉడిపి క్షేత్రమున ఒకప్పుడు అనుచరులందరును భోజనమునకు సిద్ధులై కూర్చుండిరి. అప్పుడు ప్రాసంగికముగ నొక భక్తుడు—దాసులు కోరిన గంగ యిచ్చుటికే తెంచునని పరిహాసమాడెను. వెంటనే పురందరులు గంగపై నొక ర్తనుపాడగా జలజలమని గంగ ప్రవహింప మొదలుపెట్టెనట. భక్తులు విస్మితులై దాసుని శరణువేడికొనగా తిరిగి మరియొక కీర్తనముపాడి ఆ గంగాజలప్రవాహము నరికట్టెనట.

పండరిపురమున పాండురంగ విఠలుని యాలయమునందలి స్వర్ణపాత్రను దొంగిలించెనని నేరారోపణచేసి న్యాయాధికారి పురందరుని కొరడాతో కొట్టుడని భటుల కాజ్ఞాపించెనట—భటులీతనిని కొట్టుచుండిరట. విఠలునిపై పురందరుడు కీర్తనలను పాడుచుండెనట. బహు విచిత్రముగా భటులు కొట్టుచుండిన దెబ్బ లొక్కటియు ఆయనకుతగులక పోవుటయే గాక-ఆ న్యాయాధికారికి, భటులకు, తగిలెనట. ఇట్టి మహిమలను దాసునిగూర్చి ఎన్నెన్నో లోకులు చెప్పికొందురు.

దాససాంప్రదాయమునకు చెందిన దాసుల యందు వారి ఉపదేశములయందు కొన్ని సామాన్య లక్షణములు కాననగును. తత్త్వజ్ఞాన దృష్టిలో వీరందరును మాధ్వసాంప్రదాయులైన ద్వైతులే. వీరందరును ఉచ్ఛ ఆధ్యాత్మికానుభవమును అనుభవించినవారే. ఈ విధముగ వారు అనుభవించిన వివిధ భక్తి భావములే కీర్తన వచనాదులలో వెలసినవి. గురుభక్తి, భక్తిమహిమ, నామమహిమ, ఆర్త భావము, వైరాగ్యము, శాంతభావము, దాస్య భావము, సఖ్యభావము, వాత్సల్యభావము, సాక్షాత్కారము, సిద్ధిభావము మొదలగునవన్నియు, దాసకోటికి సామాన్య లక్షణములు. భక్తిమార్గమున ముకుందాన్వేషణయే వారి పరమోద్దేశము.

# మా న స బో ధ

బాలకవి శ్రీ ఓరుగంటి నారాయణప్ప

(గత సంచిక తరువాయి)

తే॥ గీ॥ ఎపుడొ, యేరోగమేర్పడ ఽ నేగుగాదె! ; తనువు విలవిలదన్నుక ఽ తత్త్వదృష్టి
అపుడు గల్గునె? యిప్పుడే ఽ యాతురముగ ; బ్రహ్మచింతనజేయుమా ఽ భక్తి మనస! 51

తే॥ గీ॥ నరము లెముకలు మాంసముఽనరయమాత్ర ; ములకు నాలయమీ దేహఽమున్న స్థిరత?
షడ్వికారాలయంబిది ఽ సత్యమానె? ; కొన్ని దినముల ముచ్చట ఽ లెన్న మనస! 52

తే॥ గీ॥ కొమ్మరెమ్మలు నదులలో ఽ కొట్టుకొనుచు ; కొంతదూరంబు జలమున ఽ కూడి బాయు
భాతి పుత్రాదివస్తువుల్ ఽ బాయు గూడు ; కర్మగతిరీతి నీ విది ఽ గనుము మనస! 53

తే॥ గీ॥ దీపముండగనే పనుల్ ఽ దీర్చు రీతి ; ఆత్మదేహాన వెల్గుచు ఽ న్నట్టి తరినె
నిలిచి నిలుకడ నిర్మల ఽ నిజసుఖంబు ; గాంచి ధన్యత నొందుమా ఽ కడకు మనస॥ 54

తే॥ గీ॥ పుట్టుకకు ముందు దేహంబు ఽ పొసగలేదు ; లేదు గిట్టిన తదుపరి ఽ లీలగాదె!
మధ్యనొక కొంతకాలంబు ఽ మసలు దేహ ; మేల నమ్మెదు నశ్వర ఽ మిద్ది మనస॥ 55

తే॥ గీ॥ పొంచి పులి లేడి జంపుక ఽ పోవురీతి ; పొంచి యముడెప్డొ నినుగొంచు ఽ బోవు నకట!
వెఱ్ఱియాశల వత్సరా ఽ ల్వెతలబడుచు ; బ్రదుకగోరెదు యోచించు ఽ ప్రజ్ఞ మనస॥ 56

తే॥ గీ॥ సచ్చిదానంద వ్యాపక ఽ స్వప్రకాశు ; డైన పరమాత్మ కీ దేహ ఽ మంటగట్టి
వివిధదుఃఖాలపాలుగ ఽ వేగ జేసి ; అకట! చెఱసాల జేసితి! ఽ వహాహ మనస!! 57

తే॥ గీ॥ మాటలెన్నియొ పల్కెదు ఽ మాటలాడి ; నటుల జేయవు కార్యము ఽ లహహ!! నీచు
భావమే యిట్టిదానేమొ ఽ ప్రకటమాయె ; అరచు శునకంబు కరవద ఽ న్నట్లు మనస! 58

తే॥ గీ॥ అందుకే పెద్దలనిరి నీ ఽ యవకతవక ; మార్గసంచారములజూచి ఽ 'మంకు మనమ!
జ్ఞాని ముల్లోకములజూడ ఽ గానరాడ ; టంచు' నికనైన పరతత్త్వ ఽ మరయు మనస॥ 59

తే॥ గీ॥ నీకు సంచారభూములై ఽ నెగడునట్టి ; స్వప్న, జాగర, సుప్తులు, ఽ జక్క దెలియ
నవియె ముల్లోకములు జ్ఞాని ఽ యందు లేడు ; కలడు జ్ఞాని తురీయలో ఽ కమున మనస॥ 60

తే॥ గీ॥ శుద్ధ సత్త్వ ప్రధానమై ఽ చెలగునట్టి ఽ అలతురీయాన నిర్మలా ఽ త్మైక్యమొంద
యోగరూపతసాధన ఽ మొర్పుతోడ ; జేసి చిత్సుఖమొందుము ఽ చెలగి మనస॥ 61

తే॥ గీ॥ దలప నిరువదినాలుగు ఽ తత్త్వములను ; నడపు నింద్రాది దేవత ఽ నాథులంత
బద్ధజీవుని నీ పాశ ఽ బద్ధు జేసి ; త్రిప్పుచున్నావు లోకాల ఽ దెలియ మనస! 62

తే॥ గీ॥ ఎటుల భావింప నా రీతి యెల్లకాల; మటులె తనువబ్బునని 'గీత' యనెడి పల్కు—
వినుము విషయాల పొందును విడిచి తెలివి; గనుము పరమాత్మ యోగైక కాంక్ష మనస॥

తే॥ గీ॥ ఇంద్రియంబులు విషయాల నింత దిరుగ; నీవు విషయాల దిరుగక నిర్మలాత్మ
భావమూనిన విషయాల పట్టువడవు; కర్మలంటవు భువి నిన్ను గనుము మనస! 64

తే॥ గీ॥ మూలగూర్చొని నరుడు దా మోదమొప్ప; దైవచింతన జేయంగ దలప నీవ
చలనమొందుచు విషయాల సంచరింప; గలదె సన్ముక్తి నరునకు గనుము మనస! 65

తే॥ గీ॥ రథము దేహంబు బుద్ధి సారథియు నవలి; ఇంద్రియంబులు గుఱ్ఱము లెఱుగ నీవ
పగ్గములు, ప్రాణదశకంబు పరగ నిరుసు; ధర్మము నధర్మమా చక్ర ద్వయము మనస॥

తే॥ గీ॥ బంధమా చిత్తమా శబ్ద పంచకంబు; లగును సంచారభూము లీ వరయ బద్ధ
జీవు డభిమానరథికుండు చేరి నిన్ను; పొందుచున్నాడు జన్మలు మూఢ మనమ॥ 67

తే॥ గీ॥ అట్టి జీవుండు శుద్ధుడై యంతరాత్మ; ప్రణవకార్ముక సాధన బడసెనేని.
పొందడిక జన్మకోటుల ముందునెపుడు; లేదు నీ దర్శనము మఱి లేదు మనస! 68

తే॥ గీ॥ ఎందఱెందఱో ఛీ! యని యెఱుగ జెప్ప; భవము రోయక సంసార భ్రాంతిగూడి
తిరుగుచున్నావు మాయను తిరము లేక; పుణ్యముండినగా బుద్ధి పుట్టు! మనస! 69

తే॥ గీ॥ పాప పుణ్యాలు నీ విల బడయగాదె!; స్వర్గనరకాదిలోకముల్ శాసకులును
రచన మొనరించె హరియు నీ రంపదెంతో; చేయు సింహావలోకన చెలగి మనస॥ 70

తే॥ గీ॥ గడుసుదనమును, బింకంబు, గర్వగుణము; విడిచి నిర్మల శాంతంబు విష్ణుభక్తి
నీశ్వరార్పిత కర్మల నెఱుకతోడ; నాచరించుచు జేరుమా హరిని మనస॥ 71

తే॥ గీ॥ దేహి జీవుని నీవు వి దేహపురికి; ననుప నది యెంత యుపకృతి యానో చూడు!
అచట నీ యాట సాగదు అందుకొఱకె!; ఇందు జీవుని నాడింతు వెంతో మనస! 72

తే॥ గీ॥ దుఃఖసాగర మిదియని దూరదృష్టి; జూచి సంసృతి నెడబాసి శుద్ధబోధ
జాటె ప్రజకెల్ల నెంతయో జాలినొంది; ముక్తినొందెను బుద్ధుడు మున్ను మనస. 73

తే॥ గీ॥ ఆ మహామహు డారయ నల్పుడౌనె?; కొరతగల్గెనె సంపదల్ గోరనతడు?
అగ్గిమూటలు సంపద లాశలనుచు; ముక్తుడయ్యెను వైరాగ్య మొంది మనస॥ 74

తే॥ గీ॥ సద్గురుని జేరి భయభక్తి సమ్మతముగ; నలచతుర్విధ శుశ్రూష లాచరించి
తెలివి బరమాత్మ నెఱుగంగ తెరువెఱుంగ; ప్రబలకృషిసల్పు నీకిది బాగు మనస॥ 75

(సశేషము)



# రాణి రాస్మణి దేవి

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి.ఏ.

శ్రీ రామకృష్ణపరమహంసదేవులు తమ క క్రీడారంగముగ నెలకొల్పినట్టియు, భవతారణి, రాధాకాంత ఆదిగా గల దేవతాలయమునందలి యా ప్రతిమలు మృణ్మయ స్వరూపములుగ గన్పట్టినను, మహా చైతన్యశక్తితో నీ నాటికిని విరాజిల్లుచున్నట్టియు, కలకత్తాకు నాల్గుమైళ్లదూరమున దక్షిణేశ్వరమునందలి దేవాలయమును గట్టించి, తాను తరించి, భక్తులను దరింపజేయుట కాశ్రయ మేర్పాటుజేసిన చిర స్మరణీయయగు ధన్యజీవి, రాణిరాస్మణిదేవి. ఈమె స్త్రీల కాదర్శయగు దానశీల, పుణ్యవతి, గృహలక్ష్మి, అన్నపూర్ణ, సదాచారసంపత్తిగల మహా భక్తురాలు. శ్రీరామకృష్ణుల లీలారంగముల కీమె పెన్నిధి. ఈమె జీవితమును గాంచువారల కామె తక్కువజాతియందు పుట్టినను, పేదరాలైనను, ''రాణి'' కుండవలసిన యుదారహృదయము ఆమెయందు విదితమగుచున్నది.

రాస్మణి జననము 1800-వ సంవత్సరము. ఈమెది కలకత్తాదరినున్న 24 పరగణాలకు జెందిన, గంగానదికి తూర్పు పెడనున్న కోన యనుపల్లె. ఈమె తండ్రిపేరు హరేకృష్ణదాసు. తల్లిపేరు రామప్రియదాసి. వీరిది బహు బీద కుటుంబము. ఈ తల్లిదండ్రులు, దాను, దన యన్నలిద్దరు, సోదరీ లిర్వురతో నొక పూరింటియందు నివాసము. తండ్రి గృహనిర్మాణవృత్తి వలన జీవించెడువాడు.

నిత్యము తనయింట కృత్తివాసుల రామాయణము, కాశీదాస విరచిత భారతమును బారాయణము చేసెడివారు. ఈ భగవత్కథా కాలక్షేపమున కా యూరివారాతనియింట జేరెడువారు. వీరు ''దాశ లేక దాసి'' యను పేరు స్ఫురింపజేయు నగ్నికుల క్షత్రియులు. తండ్రి దయార్ద్రహృదయుడు; ఆధ్యాత్మిక జీవి, ధర్మచింతగలవాడు. తల్లి సరళహృదయ, బ్రాహ్మణభక్తిగల్గిన యాధ్యాత్మ్యపిపాసి.

రాణి చిన్నతనమున నాపల్లెయందు జెట్లపై దూగుటుయ్యాలలూగుచుండెడిది. ఒకనాడ ట్లాడుకొని, యొక మేడిచెట్టు మొదట పండుకొని నిద్రించెను. నిద్రలో ఆ మేడిచెట్టు పుష్పించినటు లొక కలగనెను. ఇట్టి కలగన్నవారు, తమ జీవితమున గొప్ప భాగ్యవంతులై సుఖ, సంపదల బడయుదురని ఫలశ్రుతి. తల్లి యాకలనాలించి, యామె రాజపత్నియై, రాణియైయుండు భాగ్యమబ్బుననుచు, నాటి నుండి యామెను ''రాణి'' యని పిలువ నారంభించెను. ఇక రాస్మణి యనగా రాధ యని యర్థము. నిజముగా నామె జీవితముజూడ నామె రాధారాణియే! ప్రేమ - రాగ భక్తి స్వరూపమే!

రాణి యత్తవా రాదిని గటిక దరిద్రులు. మామగారిపేరు ప్రీతిరామ్. ఈతని చిన్నతనముననే తల్లిదండ్రులుపోయి, అనాథుడై, తన సోదరునితో, "మన్నబాబు" అను నొక జమీందారునియింట పెరిగెను. అవి 'ఈస్టు ఇండియా కంపెనీ' దినములు. మన్నబాబు దయవలన నాతడు గంపెనీవారలయొద్ద నుద్యోగము సంపాదించి, వారికి నమ్మకముగనుండి వారలకాహార ధాన్యాదులనమ్మి, చాలధనము నార్జించెను. అతడుపట్టినదెల్ల బంగారమయ్యెను. ఇంతలో నాతడు కొనిన రెండు జమీందారీ గ్రామము లూసరక్షేత్రములైనను, వానిపై గంగవరదలు ప్రవహించి, మెట్టపల్లములు చదునై, వండ్రు బోసికొని సారవంతములగు కన్యభూములయ్యెను. ధాన్యము, చెరకు, పైరులు, జనుములు, వెదురు పండనారంభించెను. అంత ప్రీతిరాం యోగమాయయనెడి కన్యను పుట్టెడు భూమి కట్నముతో వివాహమాడెను. వీరికి హరిచంద్ర, రాజచంద్రులను నిద్దఱు పుత్రులు గలిగిరి. అందు రాజచంద్రుడు రెండు వివాహములజేసికొనినను రెండువివాహములును అక్కఱకురామి, 'సంతానప్రాప్తియైన లేకుండెను. ఆ సమయమున రాజ చంద్రుడు మన రూపలావణ్యాగుణ విశేషములతో పది సంవత్సరములుదాటి వివాహార్థమై కాత్యాయనిపూజలు సల్పుచుండు రాస్మణి శీలమునుజూచి, యామెను 1811-వ సంవత్సరమున వివాహమాడెను.

వివాహము నాటినుండియు దన భూలోకదైవమగు భర్తకు, అత్తమామలకు బరిచర్యల జేయుచు, వారల యాదరాభిమానములం జూఱగొనుచుండెను. గృహకృత్య కలాపముల నతి శ్రద్ధాభక్తులతో నెరవేర్చుచు, నతిథి సత్కారముల జరపుచు, దేవునిగదియందు దేవతారాధనల సల్పుచుండెడిది. భోజనాత్పూర్వ మత్తమామల పాదములు గడిగి, యా నీళ్లను దీర్ఘముగా గ్రోలెడిది. ఉదయాద్యస్తమయమువరకు గృహకృత్యములతో కాలము బుచ్చెడిది. దేవునిగదిని శుభ్రపరచుట, పూజకై పువ్వులనుగోయుట, పాకశాలకుబోయి వంటలయందు పాల్గొనుటయు నామెపనులు. ఇట్లు నిరంతరము శ్రమపడవలదని యత్తగా రామెకు పదేపదే చెప్పినను, ఆమె యీ పనులను విడువదాయె. ఈమెను వివాహమాడిన నాటినుండియు భర్త కైశ్వర్యము దినదిన ప్రవర్ధమానమగుచుండెను. కలకత్తాలోని భాగ్యవంతులలో నీతడు వాసికెక్కెను. కంపెనీ భాగస్థులతోను, రాజాధిరాజులతోను, జమీందారులతోను మన రాజచంద్రుడు 'చట్టాపట్టా'లు పట్టుటయేగాక తన దానధర్మములవలన, నుదారస్వభావమువలన నందరి మన్ననల బడయుచుండెను. ఇట్టిది శ్రీరాజచంద్రుని మిత్రబృందము. రాజచంద్రుడన్ని విషయములందు రాణిరాస్మణిదేవి సలహా తప్పక పుచ్చుకొనుచుండెడివాడు. వీరుభయులు ననేక దానధర్మముల జేసిరి.

ప్రీతిచంద్రుడు మరణించినప్పుడు వీరికి గంగాతీరమున నీడలేకపోవుటచేతను, ఆ నీటిలోను బురదలోను పడిన బాధను సహింపలేకయు, వెంటనే యచ్చట 32 స్తంభములపై నిలిచిన చాదినీ నిర్మించి, దానికి రోడ్డునుగూడ వేయించిరి. ఈ ఘట్టమునకు "బాబురాజచంద్రఘాట్" అనియు, ఆరస్తాకు "బాబురోడ్" అనియు పేర్లు. హరితోలఘాట్ నం దవసానావస్థయందలి వారి కొక గృహనిర్మాణమును జేసి, యచ్చట సేవకులను,

వైద్యశాలనొకని నేర్పాటుచేసిరి. పదివేలరూప్యములు ఖర్చుచేసి యొక గ్రంథాలయమును స్థాపించిరి. ఇంక నెన్నియో వాపీ, కూప, తటాకాదుల నేర్పాట్లుచేసి, ప్రజాసేవచేసిన మృతజీవు లీ పుణ్యదంపతులు. ఇంతేకాక 25 లక్షలబెట్టి 'రాణిరాస్మణికోఠి' యను రాజభవనమును కట్టించిరి. ఈ భవనముచుట్టును దమపై నాధారపడినవారలకు గృహములు, నొకవైపున 'కసరత్తు'నకు స్థలమును, వివిధ వాద్యములకొక యేర్పాటునుగలిగి తుపాకులు, కత్తులు, కఠారులతో నీ భవన మలరారుచుండెను. ఈ భవనమున నుత్తరదిశయందొక సన్న్యాసి రాజచంద్రునకిచ్చిన రఘువీరుని ప్రతిమతో రఘునాథ మందిర ప్రతిష్ఠయు గావింపబడెను. రాజచంద్రునకు బద్మమణి, కుమారి, కరుణామయి, జగదంబ యను నల్గురు కుమార్తెలు. అల్లురు, మనుమలు, మునిమనుమలతో నీ రాజభవనము నిత్యకళ్యాణము, పచ్చతోరణముగా భాసిల్లుచుండెడిది.

ఇట్లుండగా రాజచంద్రు డొకనాడు గుఱ్ఱపు బగ్గీలో వచ్చుచు గలకత్తానగరమున వడగాలి తగిలి తన 49-వ సంవత్సరమున హఠాత్తుగా చనిపోయెను (1843). అంత రాస్మణిదేవి దుఃఖసముద్రమున మునిగి మూడుపవాసములు గూడ జేసెను. ఆ దినములందు తులాభారము దూగి, యా ధనమును బ్రాహ్మణులకు దానము చేసెను. ఇంక నెన్నియోవిధములగు దానములతో రాజచంద్రుని యంత్యక్రియలను రాణి జరిపించెను.

రాజచంద్రుడు చనిపోయిన పిమ్మట రాణి రాస్మణియే తన వ్యాపారములను నిర్వర్తించుచుండెను. ఆమె యల్లుడగు మథురనాథ్ బిస్వాస్ (మథురబాబు) ఆంగ్లవిద్య నభ్యసించినవాడును, తెలివిగలవాడును అగుటవలన నామె కన్నివిధముల సాయపడుచుండెను. ఆమె యుదయమున లేచి, రఘునాథుని దర్శనము సేసికొని, స్ఫటికమాలతోను, పెద్దవియగు తులసిపూసల తావళముతోను జపమును జేసికొనియెడిది. ఆమె మెడలో బంగరు హారమును ధరియించెడిది. ఉదయమున మథురబాబుతో కలిసి వ్యవహారముల సరిదిద్దుకొని, రఘునాథుని సేవించి, భోజన భాజనాదుల పిమ్మట గొంచెము నెమ్మదించి, సాయంకాలమున పండితులవలన బురాణాదులను, శాస్త్రములనువినుచు, దిరిగి తన వ్యవహారములను జూచుకొనియెడిది.

ప్రతి సంవత్సరము రఘునాథుని రథయాత్ర కన్నుల పండువుగ జరిపించెడిది. దీనికి వివిధ వాద్యములుండెడివి. ప్రేక్షకులపై నత్తరు, బన్నీరులు జల్లెడివారు: హుక్కా, తాంబూలములంగూడ నిచ్చెడివారు. బంధువులకు, వచ్చిన వారలకు బట్టలతో, మంచి సంభావనలతో నాతిథ్యమీయబడియెడిది. దీనికి రు 8,000 లు ఖర్చు. ఇటులనే దుర్గోత్సవముతో నొక వారము శోభిల్లెడిది. అంత వసంతోత్సవము, హోలీపండుగలతో నొక నెల గడిపెడిది. ఇండ్లు, వాకిండ్లు, వీధులు నలంకారములతో నలరారుచుండెడివి. సంగీతములు, నాటకములు, మేళతాళములు, నృత్యగీతములతో నా 'రాజకోఠి' పరిసరములెల్లను నతి శోభాయమానముగ నుండెడివి. ఈ విధముగనే నందోత్సవము, జన్మాష్టమి, వసంత పూజ, సరస్వతీపూజ, లక్ష్మీపూజ, కార్తిక పూజ, జగద్ధాత్రిపూజ మొదలగు పూజా పునస్కారములతోడనో, యే శుభకార్యములతోడనో యుత్సవములు జరుగుచుండెడివి. అన్న

శాంతి, జలశాంతులతో, ధనధాన్యసమృద్ధియై, యతివైభవముతో రాస్మణికోఠి యలరారు చుండెడిది.

రాణిరాస్మణిదేవి బంధు, మిత్ర పరివార సమేతురాలై, తన యౌన్నత్యమునకు తగు నేర్పాటులతో పూరీ జగన్నాథక్షేత్రము, ప్రయాగ త్రివేణిసంగమము, నవద్వీపము, అగ్రద్వీపము, గంగాసాగరము మొదలగు తీర్థాదుల సేవించెను. నవద్వీపమున మరల తులాభారము దూగినది. రాస్మణిదేవి లక్షలకొలది ధనమును దీర్ఘయాత్రలకు, దానధర్మములకు వినియోగపరచెను.

ఆమె కులదీపకురాలు. ఒక పర్యాయము గంగానదియందు జేపలనుబట్టు జాలరులకు సర్కారువారు పన్నును విధించిరి. దీనివలన బల్లెవారి కమితబాధ కల్గెను. వీరల మొఱలాలించి రాస్మణిదేవి గంగలో కొంతభాగమున జేపలనుపట్టుకొను హక్కును కొనెను. ఆ వెంటనే తనహక్కుగల ప్రదేశమున అద్దరి ఇద్దరులకు మేదరతడకలతో నడ్డుగట్టించెను. దాని వలన గంగపై నడచు నావలకు, బొగయోడలకు నడ్డుసేయరాదని సర్కారువారు శాసించిరి. అంత రాణి తాను పాడినపాటకు దగు చేపలు దొరకనందున నష్టముగల్గుననెను. సర్కారువా రీమె హృదయమును గనిపెట్టి, యాపన్ను నెత్తివేయుచు, నామె సర్కారునకు గట్టిన పన్ను నామెకు తిరిగి యిచ్చివేసిరి. అంత నాజాలరు లామెను దీవించుటయేగాక, యామెపై కవనములుసేసి పాటలనుగూడ బాడ నారంభించిరి. ఇట్లే యామె నీలి (మందు) సుంకమువలన ప్రజలుపడు నిక్కట్లను జూచి, దానిని ప్రతిఘటించి యాపన్నును రద్దు చేయింపగలిగెను. ఆమె పేరు చెప్పిన నామె ధైర్యమునకు, నామెకుగల నిర్భయ స్వభావమునకు నెంతటి దుండగీండ్రకైనను సింహస్వప్నమే. ఆమె భవనముదగ్గరగ నుండిన యాంగ్లేయ సిపాయిలు తప్పత్రాగి, యాభవనపు కావలి వారిని బాధించి, రాస్మణికోఠిలో ప్రవేశించి యాభవనమును దోచిరి. ఆమె యాయుధపాణియై, రఘునందనుగుడియందు దలదాచుకొని, వారల నెదుర్కొని తిరిగి సర్కారువారి వలన దనయాస్తినంతను సంపాదింపగలిగెను.

అదృష్టవశమున రాస్మణి కావంతయు దీసిపోనివాడు, సమర్థుడు, నాంగ్లవిద్య నభ్యసించిన వాడునగు మధురమోహనవిశ్వాసుడను నాతడామె కల్లుడాయెను. మధురమోహను డామె మూడవకుమార్తెను వివాహమాడెను. ఆమె చనిపోయినందున నా బాంధవ్యమునందలి ప్రీతిచే, నా బాంధవ్యమును నిలుపుకొనుటకు దన నాల్గవ కుమార్తెయగు జగదంబదాసినిచ్చి మధురబాబునకు బరిణయము సేసెను. ఇటు లెవరియాస్తులను వారు సంరక్షించుకొనుచు, నొకరి కొకరు సాయపడుచుండుటయేగాక మధురబాబు రాస్మణిదేవి కెంతయో దానధర్మములందు చేతోడు వాతోడునై మెలగుచుండెను.

(సశేషము)

# శ్రీ వాసుదేవ మననము

## ద్వితీయ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

ప్రకృతవిషయ మేమియన "ముముక్షువః పురుషాః సాధన చతుష్టయ సంపన్నాః శ్రద్ధావంతం సత్కులభవం శ్రోత్రియం శాస్త్రవాత్సల్యాం గుణవంత మకుటిలం సర్వభూతహితేరతం దయాసముద్రం సద్గురుం విధివదుపసంగమ్యోపహారపాణయోఽష్టోత్తర శతోపనిషదం విధివదధీత్య శ్రవణ మనన నిదిధ్యాసనాని నైరంతర్యేణ కృత్వా ప్రారబ్ధక్షయాద్దేహత్రయభంగం ప్రాప్యోపాది వినిర్ముక్త ఘటాకాశవత్పరిపూర్ణతామేతి। విదేహముక్తి సైవకైవల్యముక్తిరితి—ముక్తికోపనిషత్॥" మోక్షమునందు తీవ్రమైన కాంక్షగల సాధన చతుష్టయసంపన్నులయిన పురుషులు, శ్రద్ధావంతుడును, సత్కులసంభవుడును, శ్రోత్రియుడు అనగా అధ్యయన శ్రుతార్థసంపన్నుండును, శాస్త్రవాత్సల్యముగలవాడును, పూర్వోక్త లక్షణుడును, నిష్కపటియు సర్వభూతహితాచరణరతుడును, దయాసముద్రుడును అగు సద్గురువును విధ్యుక్తప్రకారము సమిత్కుశోపహారపాణులై సమీపించి, వారి సాన్నిధ్యమున అష్టోత్తరశతోపనిషత్తులను విధ్యుక్త విధానమున నధ్యయనముచేసి నైరంతర్యముగ వేదాంత శ్రవణ మనన నిదిధ్యాసనముల నభ్యసించుచు అధిగతస్వాత్మజ్ఞానముచే ప్రారబ్ధక్షయమగుటవలన శరీరత్రయభంగమును బడసి, ఘటోపాధి నశింప ఉపాధి వినిర్ముక్త ఘటాకాశము మహాకాశమే యగుచు పరిః మును పొందిన చందమున, స్థూల సూక్ష్మ కారణోపాధిత్రయవినాశమున అద్వితీయాఖండైకరసపరబ్రహ్మమే యగుచు పరిపూర్ణత్వమును పొందుదురు. ఇదియే విదేహముక్తి. ఇదియె కైవల్యముక్తి" యని శ్రుతి. అందువలన అధికారియైన బ్రహ్మవిద్యార్థి శాస్త్రోక్త విధానము ననుసరించి ఉపహార సమిత్పాణియగుచు సద్గురుని సమీపించి తొలుత సాష్టాంగ దండవత్ప్రణామము నాచరింపవలయును. ఏలయన "ఊర్ధ్వం ప్రాణాహ్యుత్క్రామంతి యూనస్స్థవిర ఆగతే। ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తా న్ప్రతిపద్యతే॥" (మనుః. 2–120). తరుణునకు స్థవిరుని సామీప్యము కలిగినప్పుడు యువకుని ప్రాణములు వాని శరీరమునుండి బయటకు ఉత్క్రమింప ప్రయత్నించును. అప్పుడా యువకుడు ఆ స్థవిరునకు ప్రత్యుత్థానాభివాదనముల నాచరించుటచేత (అభివాదనమనగా— కులగోత్రనామోచ్చారణపూర్వకముగ సాష్టాంగదండవత్ప్రణామము) ఆ యువకుని ప్రాణములు మఱల స్వస్థమగును. స్థవిరుడనగా.—"న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః। యో వై యువాఽప్యధీ యానః తం దేవాః స్థవిరం విదుః॥" (మనుః. 2–156). తల నెరసినంతమాత్రమున స్థవిరుడు – వృద్ధుడు కాడు. తరుణుడైనను తత్త్వవిజ్ఞానియైన విద్వాం

సుని స్థవిరునిగ దేవతలు గ్రహించుచున్నారు.'' అట్లు ఆచార్యున కభివందనముజేసి వారి యనుజ్ఞను బడసి యంతట విశ్వాసవినయములతో సహ 'స్వామీ! ఓ ప్రత్యక్షదైవమా! ఆచార్యోత్తమా!' అని వారిని సంబోధించి వారిని ప్రసన్నులజేసికొని **వారి** యాజ్ఞానుసారము అపుడు ''అధీహి భగవన్ బ్రహ్మవిద్యాం వరిష్ఠాం సదా సద్భిస్సేవ్యమానాం నిగూఢాం। యయాఽచిరాత్సర్వపాపం వ్యపోహ్య పరాత్పరం పురుష ముపైతి విద్వాన్॥'' (కై. ఉ. 1.) ఓ భగవంతుడా! శ్రేష్ఠతమమైనదియు, నిత్యము సత్పురుషులచే సేవింపబడుచుండు నదియు, అతిరహస్యమైనదియు నగు ఏ బ్రహ్మ విద్యాలబ్ధిచేత తత్క్షణమే అఖిలపాపవిముక్తిం బొంది విద్వాంసుడు పరాత్పరుడైన పరమ పురుషుని పొందుచున్నాడో అట్టి బ్రహ్మవిద్యను ప్రబోధింపుడు - అని ప్రార్థించి - 'జీవుడెవరు? ఈశ్వరుడెవరు? జగత్తెట్టిది? ఈ జీవేశ్వర జగత్తులు దేనివలన వచ్చినవి? దేనివలన బోవును?' అని ప్రశ్నింపవలయును.

అంతట ఆచార్యుడు 'సద్బుద్ధిస్సాధుసేవీ సముచిత చరితస్తత్త్వమేధాభిలాషీ। శుశ్రూషుఃత్యక్తమానః ప్రణిపతనపరః ప్రశ్నకాల ప్రతీక్షః। శాంతోదాంతో నసూయుశ్శరణముపగతశ్శాస్త్రవిశ్వాసశాలీ। శిష్యః ప్రాప్తః పరీక్షాంకృతవిదభిమతం తద్వతశ్శిక్షణీయః। శిష్యాజ్ఞానకృతంపాపం గురోఃభవతినిశ్చయః। తస్మాత్సర్వప్రయత్నేన గుణాన్సర్వాన్ పరీక్షయేత్। తతోదీక్షాం సమాచరేత్॥'' (శారదా తిలకము) ఆత్మజిజ్ఞాసువగుచు బ్రహ్మవిద్యార్థము తన్నాశ్రయింపవచ్చిన యా బుభుత్సువును సద్బుద్ధిమంతునిగను, సాధుసజ్జన సేవాపరాయణునిగను, తత్త్వమేధావిగను, ఆత్మజిజ్ఞాసువు తీవ్రముముక్షువుగను గురుశుశ్రూషా కుశలునిగను, నిగర్విగను, సంధ్యావందనపరునిగను, ప్రశ్నకాల ప్రతీక్షుడుగను సాధన చతుష్టయ సంపన్నుడుగను, అసూయారహితుడుగను, ప్రపన్నుడుగను, శాస్త్రవిశ్వాస శాలిగను పరీక్షచేసి తెలిసికొని శిష్యునిగ స్వీకరించి వానికి బ్రహ్మవిద్య బోధింపవలయును. అజ్ఞానముచేతనైనను శిష్యకృత పాపము నిశ్చయముగ నాచార్యుని బొందును గనుక సర్వవిధముల కాగల శిష్యునిగుణములను పూర్తిగపరీక్షించి, బ్రహ్మవిద్యోపదేశమునందు సత్పాత్రునిగ నిశ్చయించినతరువాతనే వానికి బ్రహ్మవిద్యనుపదేశింపవలయును. ''శుశ్రూషాలాభపూజార్థం యశోర్థంవాపరిగ్రహః। శిష్యాణాం నతుకారుణ్యాచ్ఛిష్యసంగ్రహ ఈరితః॥') (సన్యాస. ఉ. 2-82) శిష్యపరిగ్రహము శుశ్రూషాలాభ పూజార్థముగాని యశస్సుకొఱకుగాని కాదు. తీవ్రముముక్షువులకు బ్రహ్మవిద్యాదాన **మూల**మున వారిని దుస్తరసంసారపారావారమునుండి సముద్ధరించుటకొఱకే శిష్యసంగ్రహము చెప్పబడినది. కనుక శుశ్రూష ఖ్యాతి లాభపూజల నుద్దేశించి అనధికారులు గుణహీనులు అపాత్రులునగు పురుషులకు బ్రహ్మవిద్య నుపదేశించినయెడల గురుశిష్యుల కుభయులకునుగూడ నవశ్యము హాని సంభవించును. ''శాంకరీయం మహాశాస్త్రం నదేయం యస్యకస్యచిత్। నాస్తికాయ కృతఘ్నాయ దుర్వృత్తాయ దురాత్మనే। గురుభక్తి విశుద్ధాంతఃకరణాయ మహాత్మనే। సమ్యక్పరీక్ష్యదాతవ్యం మాసం షణ్మాసవత్సరం॥'' (తేజోబిందు. ఉ. 6-108, 109.) నాస్తికుడు కృతఘ్నుడు దుష్ప్రవర్తనుడు దురాత్ముడు - దుష్టస్వభావుడు - నగు వానికెవ్వనికిని బ్రహ్మవిద్యామహాశాస్త్రము

ఉపదేశింపదగినది కాదు. సద్గురు భక్తుడును పరిశుద్ధాంతఃకరణుడునైన మహాత్మునకు ఒక మాసముగాని ఆఱుమాసములుగాని సంవత్సరముగాని మఱియు "ద్వాదశాబ్దం తు శుశ్రూషాం యః కుర్యాదప్రమాదతః తస్మైవాచ్యం యథాతథ్యం దాంతాయ బ్రహ్మచారిణే॥" (యోగశిఖ. ఉ. 2-2.) ప్రమాదము పొందకుండ పండ్రెండు సంవత్సరములు ఎవడు నిజసద్గురుని సేవించునో అట్టి అధికారియు బ్రహ్మచారియునైన శిష్యునికొఱకే బ్రహ్మవిద్య ప్రబోధింపదగినది"—అనెడి శ్రుతి మానమున పండ్రెండు సంవత్సరములు లెస్సగ పరీక్షించి తరువాతనే బ్రహ్మవిద్య నుపదేశింపవలయునని శ్రుతివచనము. మఱియు "నాపృష్టః కస్యచిద్బ్రూయాత్ నచాన్యాయేన పృచ్ఛతః। జానన్నపిహి మేధావీ జడవల్లోక ఆచరేత్॥" (సన్న్యాస. ఉ. 2-102) అప్రార్థితుడై ఆత్మవిద్యయెవ్వరికి నుపదేశింపగూడదు. న్యాయవిరుద్ధమైన ప్రశ్నలకు మాఱుపలుకదగదు. "సర్వజ్ఞుడయ్యును ప్రాజ్ఞుడు జడునివలె ప్రవర్తింపవలయును." అనెడి శాస్త్రముననుసరించి యాచార్యుడు శిష్యునిచేత బ్రార్థితుండై యంతట అత్యాదరపూర్వకాతిహర్షముతో దృగ్వాక్స్పర్శరూప దీక్షాత్రయముచేతను శిష్యునకు, సత్త్వరజస్తమోగుణములచేత జీవేశ్వర జగత్తులయొక్క ఆగమన ప్రకారమును బోధించి ఆత్మస్వరూపమునుగూడ నరచేతి ధాత్రివలె నవగతమొనరించును.

"స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్। సాధనం ప్రభవేత్పుంసాం వైరాగ్యాది చతుష్టయం॥" (వరాహ. ఉ. 2-1.) స్వవర్ణాశ్రమధర్మాచరణముచేతను తపస్సుచేతను శ్రీహరి అనుగ్రహామువలనను పురుషులకు వైరాగ్యాది సాధన చతుష్టయము ప్రాప్తమగును అనెడి శ్రుతి మానమున బహుజన్మార్జిత పుణ్యపుంజ పరిపాకవశమువలన ఈశ్వరానుగ్రహము చేత సాధన చతుష్టయమును బ్రహ్మవిద్యయందధికారియైన పురుషునకు ప్రాప్తమయ్యెనని తెలియవలయును. ఈశ్వరానుగ్రహమనగా "ప్రసాదో నామ రుద్రస్య కర్మసామ్యేన దేహినాం। దేశికాలోకనాజ్జాతో విశిష్టాతిశయస్సురాః॥" (సూతసంహిత.) వేదాంతవాక్యశ్రవణాదులయందు ప్రాక్తన జన్మకర్మ సహాయమువలనగలుగు శ్రద్ధ. సద్గురు సందర్శనము వలనగలుగు ఒకానొక బుద్ధి పరిణామము అనగా అసాధారణమైనబుద్ధిసామర్థ్యవిశేషము. "ఈశ్వరానుగ్రహాదేవపుంసామద్వైతవాసనా। మహాభయకృతత్రాణాద్విత్రాణామేవజాయతే॥" (దత్తాత్రేయసంహిత.) జన్మజరామరణాది రూపమగు మహాభయమును పోగొట్టి సంరక్షించునట్టి అద్వైతవాసన ఇద్దరకో ముగ్గురికో కలిగినయెడల అయ్యది యీశ్వరానుగ్రహముచేతనే గలిగినదని తాత్పర్యము. "యావన్నానుగ్రహస్సాక్షాజ్జాయతే పరమేశితుః। తావన్న సద్గురుం కశ్చిత్ సచ్ఛాస్త్రంవాపివిందతి॥" (వశిష్ఠః) పరమేశ్వర ప్రసాదము సాక్షాత్తుగ ప్రాప్తముకాని యంతవఱకు సద్గురు లాభము సచ్ఛాస్త్రశ్రవణాది లాభమును పొందనేరడు. "యస్యప్రసాదః సంజాతో దేహపాతావసానకః। కృతార్థఏవ విప్రేంద్రసన భూయోభిజాయతే॥" (సూతసంహిత.) శరీరత్రయబాధకమైన పరమేశ్వరప్రసాదము సాక్షాదపరోక్షముగ నెవ్వనికి ప్రాప్తమగునో అట్టి విప్రశ్రేష్ఠుడు కృతకృత్యుడే. అతనికి పునస్సంసారప్రాప్తి లేదు.

(సశేషము)

# ప్రపంచమతములు

## శ్రీ నిత్యానందస్వామి

## బౌద్ధమతము

క్రీస్తుశకమునకు పూర్వము అయిదవ శతాబ్దమున గౌతమబుద్ధునిచే బోధింపబడిన బౌద్ధమతము శీఘ్రగతిని ప్రపంచవ్యాప్త మతమయ్యెను. ఉత్తమ క్షత్రియవంశసంజాతుడై గౌతమబుద్ధుడు అంతఃపుర సౌఖ్యమయజీవితమును గడపుచుండెను. పేదసాదలయొక్కయు, సామాన్యమానవులయొక్కయు, జీవితములతో సంబంధముగాని, వారి కష్టసుఖములను తెలిసికొనుటకు అవకాశముగాని లభింపని విధమున గౌతముని బాల్య జీవితము సకలసౌఖ్య సంధాయకమై యొప్పుచుండెను. ఇట్లుండ నొకనాడు హఠాత్తుగా పురపర్యవేక్షణావసరమున గౌతమ రాకొమరునికి జరాభారము, రుగ్మత, మృత్యువుల అనుభవము కలుగుటయేకాక, జరామరణాది సర్వవిధ దుఃఖాతీతుడగు సంయమి శ్రేష్ఠుని ప్రశాంతికూడ మనమున పొడకట్టెను. గౌతమునికి త్యాగముయొక్క పిలుపు వినవచ్చెను. ఆత డద్దానికి తలయొగ్గెను. నిర్వాణ సిద్ధ్యర్థము నిర్జన ప్రదేశమున ఆసనమువేసి కూర్చుండుటకు నిశ్చయించి యివ్విధమున సంకల్పించెను.

శ్లో॥ ఇహాసనే శుష్యతుమే శరీరం
త్వగస్థిమాంసం ప్రలయంచయాతు।
అప్రాప్యబోధిం బహుకల్పదుర్లభాం
నైవాసనాత్కాయ మత శ్చలిష్యతే॥

తా॥ ఈ యాసనమందు నాశరీరము ఎండి, భస్మమై పోవుగాక, త్వక్, అస్థి, మాంసము మొదలగునవన్నియు శిథిలమైపోవుగాక, అనేక కల్పములకును బొందుటకు శక్యముగాని బోధితత్త్వమును (నిర్వాణమును) బొందక నీ యాసనమునుండి యీ దేహమును గదలింపను. అని, దీర్ఘ కఠిన తపశ్చర్యచే సత్యము నాతడు సాక్షాత్కరింపజేసికొనెను. తదాదిగ ఆతడు బుద్ధుడను అన్వర్థసంజ్ఞ బరగెను. ధన్యతనందిన బోధిసత్త్వుడయ్యెను.

### గౌతమబుద్ధుడు – భిక్షువులు

బోధిసత్త్వుడు కాశిలో నివసించునపుడు భిక్షు పంచకమున కీ క్రిందివిధమున బోధించెను.

భిక్షువులారా! పారమార్థిక జీవనము సల్పునతడు తప్పుకొనదగిన విపరీత పరిస్థితులు రెండుగలవు. అవేవన:—ఒకటి కామ సంకల్పమును తదనుభవముతోగూడిన సౌఖ్య జీవనము; ఇది అధమము, తుచ్ఛము, అనాత్మజుష్టము, అనర్హము, అసహజము, మిథ్యాభూతము. రెండవది:—శరీరపోషణము; ఇదియును దుఃఖమయము, అనర్హము, అస్వాభావికము. ఓ భిక్షువులారా! ఈ రెండు మార్గములను బుద్ధుడు పరిత్యజించి, మధ్యేమార్గ

మును కనుగొనెను. ఈ మార్గము సాధకుల మనోనేత్రమును తెఱచి, వివేకము నొసంగును. శాంతిని జేకూర్చును. నిర్వాణమును కల్గించును. అనగా జ్ఞానమును ప్రసాదించును. ఆ మధ్యమార్గ మెద్ది యనెదరా? అదియే ప్రశస్తమైన అష్టదళ సోపానము.

1. సత్యవిశ్వాసము, 2. సత్యనిర్ధారణము, 3. సత్యవాక్కు, 4. సత్యప్రవర్తనము, 5. సత్యవ్యాపారము, 6. సత్య ప్రయత్నము, 7. సత్యలక్ష్యము, 8. సత్యానందపారవశ్యము.

ఓ భిక్షువులారా! ఈ యష్టవిధసాధన మార్గమే వివేకాది నిర్వాణప్రాప్తికి నేను కనుగొనిన ప్రశస్త మధ్యేమార్గము. భిక్షువులనుద్దేశించియు, లోకము నుద్దేశించియు బుద్ధుడు ప్రబోధించిన సత్య ప్రకటనమునకు భిక్షువులెట్లు కృతజ్ఞులైరో చూడుడు. ఈ క్రింది వాక్యములద్వారా బౌద్ధసంఘమునందును, ధర్మమునందును, బుద్ధునియందును తమకుగల భక్తి విశ్వాసములను ప్రకటించుచున్నారు :

1. బుద్ధం శరణం గచ్ఛామి
బ్రహ్మజ్ఞానినిఇప్పుడేశరణుజొచ్చుచున్నాము.
2. ధర్మం శరణం గచ్ఛామి
ధర్మమును ఇప్పుడేశరణుజొచ్చుచున్నాము.
3. సంఘం శరణం గచ్ఛామి
ఏకత్వమును ఇప్పుడే శరణుజొచ్చుచున్నాము.

సీ॥ బాల్యకాలమునందె ॥ భవమును నిరసించి
వ్యామోహతతి నెడ ॥ బాసె నెవడు
సంసారమదియెల్ల ॥ సారహీనంబని
సన్న్యాస ధర్మంబు ॥ జరిపె నెవడు
భోగభాగ్యములు మి॥థ్యాగతంబులటంచు
వేదాంతపథమున ॥ వెలసె నెవడు
భువి నాత్మవత్సర్వ॥భూతాని యనువాక్కు
సార్థకంబుగ జేయ ॥ జాలె నెవడు
తే॥గీ॥ అట్టిధర్మైకనిరతు డ॥త్యమలగుణుడు
భూరిసుజ్ఞానమూర్తియౌ ॥ బుద్ధదేవు
పూతచరితంబు వినరండు ॥ పూజ్యులార
సకలదుఃఖంబులుడుగుని॥స్సంశయముగ॥

# జైనమతము

ఒకప్పుడు దక్షిణభారతదేశమున విశేష ప్రాబల్యముననుండి, ప్రస్తుతము గుజరాత్ దేశమునందు మాత్రము ప్రబలియుండు జైనమతము, బౌద్ధమతమువలె కాక దేశీయమతముగనే నిల్చియున్నది.

జైనమత ప్రవక్తలలో కడపటివాడును మతసంస్థాపనాచార్యుడును అయిన వర్ధమానుడు, బుద్ధునివలెనే క్షత్రియ వంశసంజాతుడై, బుద్ధునికి సమకాలికుడుగ నుండెను. ఈతడును సంసార పరిత్యాగముచేసి, పారమార్థిక జీవనమునకు తీవ్రతమ కృషిసల్పెను. శీఘ్రకాలముననే ఈతడు సత్యసాక్షాత్కారమునంది, మహావీరుడన బ్రసిద్ధిగాంచెను. ఈశ్వరుని అస్తిత్వమునందు నమ్మకము జైనమతమునకు ప్రత్యేకముగ లేకున్నను తత్సదృశస్థితియందలి విశ్వాసముచేత బౌద్ధమత నిర్వాణమువంటి నిర్వాణపదవిని ప్రతిజీవియు పొందగల్గునను సిద్ధాంతమును ప్రతిపాదించి చాటుచున్నది. జినుడను సార్థకనామాంకితుడగు మహావీరుని యందు భక్తియు, ఆతని మతసిద్ధాంతజ్ఞానమును, పవిత్రమైన నడవడియును, అను త్రిరత్నములు నిర్వాణమునకు మార్గములుగా

నిర్వచింపబడినవి. జైనమత జీవన విధానమును గూర్చి నామిరాజర్షి బోధనల నాలకింపుడు.

నామిరాజర్షి తనపుత్రునకు పట్టాభిషేకము చేసి, రాజ్యభారవిముక్తుడై, సన్న్యాసమును స్వీకరించెను.

నామిరాజభిక్షువునకు సన్న్యాసార్హత కలదాయని పరీక్షింపనెంచి, ఇంద్రుడు బ్రాహ్మణవేషధారియై, నామిరాజర్షి చెంతకేతెంచి, "రాజా! నీ చక్రవర్తిత్వము నంగీకరింపని రాజుల నందఱిని జయించి, నీ యుత్తమ క్షాత్రధర్మమును పాలింపు" మనగా, నామిరాజర్షి యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను: "స్వామీ! సహస్రసంఖ్యాకులైన శత్రువీరులను మానవుడు జయింపవలసియున్నను, తన్ను తాను జయించినప్పుడే మానవున కెక్కువగ విజయప్రతిష్ఠ కల్గును. బహిశ్శత్రువులతో పోరాడనేల? తమలోని శత్రువులనే యెదుర్కొనుడు. తన్ను తాను జయించునాతడు నిత్యనిరతిశయ సుఖమును పొందును."

ఇంద్రుడు :—నామిరాజర్షీ! నీ వెండి బంగారములును, నీ రత్నరాసులును, నీ నగదు రొక్కమును, నీ చీనిచీనాంబరములును, నీ వాహనములును, నీ బొక్కసమును అభివృద్ధి చేసికొనుము. అప్పుడే నీవు ఉత్తమ క్షత్రియుడవగుదువు.

నామిరాజర్షి :—మేరు, కైలాస పర్వతముల వంటి హిరణ్య, రజితరాసు లపరిమితముగ నుండినను, పేరాసగల మానవునకు తృప్తి గలుగదు. అనంతమగు ఆకాశమునకువలె ఆతని పేరాశకు మేరగలదా? విశాల భూమండలమందలి పైరుపచ్చలన్నియును, హిరణ్య గోధనములును, తదితర సర్వ సమస్తమును లభించినప్పటికిని, ఏ మనుజునకును తృప్తిగల్గదని గ్రహించి, మానవుడు తపశ్చర్య కుపక్రమింపవలెను.

ఇంద్రుడు :—ఏమి విపరీతము? అదృశ్యఫలమపేక్షించి, దృశ్యములైన పరమాద్భుత సౌఖ్యములను త్యజింతువా? నీ యాశ అడియాసయే. నీకు దుఃఖప్రాప్తియు, సర్వనాశమును తప్పదు.

నామిరాజర్షి :— అయ్యా! ఇహసౌఖ్యముల కోరువాని కవి లభింపవుసరిగదా, పైపెచ్చు దుర్గతియే తుట్టతుద కాతనికి గమ్యము. ఆతని కామము నిష్ఫలమగుటచే, క్రోధముత్పన్నమగును. వెంటనే మదోద్రేకము కల్గును. మోహమావరించును. తుదకు బుద్ధినాశమై మార్గ మగోచరమగును. ఇహపరముల రెండింటను దురాశా పీడితుడిట్లు దుఃఖములపాలై భ్రష్టుడగును.

ఈ మాట లాలించినంతనే బ్రాహ్మణవేషధారియగు ఇంద్రుడు నామిరాజర్షికి ప్రత్యక్షమై, నమస్కరించి, యిట్లు స్తోత్రము చేసెను :

ధీరోత్తమా! క్రోధమును జయించితివి. అభిమానమును పోనాడితివి. సంపూర్ణస్వేచ్ఛను బడసితివి. నిర్వాణమును చూరగొంటివి. మోహమును తిరస్కరించితివి. దురాశను దునుమాడితివి. మార్గదర్శియు, మతకర్తయునైన జినునకు జయమగుగాత. జయమగుగాత.

(సశేషము)

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

అమెరికా.

ప్రియ అ...

నీవు ప్రేమానురాగములతో వ్రాసిన లేఖను జదివి సకల విషయముల గ్రహించితిని. నీవేల శారీరక మానసిక కష్టముల ననుభవించు చున్నావు? ఈ దేశమునకు రమ్ము. నిన్ను విస్తరింపజేసికొనుము. ఒక్క శరీరమునందే బద్ధుడవు కావలదు. నిన్నుగూర్చియే తలంచుచు కాలమును వృథసేయకుము. అట్టి తలంపు లెన్నియో జరిగినవి. ఇక బాహ్యమునుగూర్చి, ఇతరులగూర్చి, తలంప నారంభింపుము. ఎంతయో శ్రేయస్సు గలుగగలదు. అనుకున్నరీతిగా మన శీలమును సృష్టించుకొనగలమా? మన శీలము తనంతటనే తయారు కాగలదు. దేవియే యీ విషయమున దగు నేర్పాట్లు గావించును. నీ రాకకు సమ్మతింపుము. నీయందు నాకు విశ్వాసముండుటవలననే యిట్లు చెప్పుచున్నాను. క్రమక్రమముగా నీకు ధైర్యము గలుగగలదు. నన్ను నీవు జూచితివి గదా! వలయునంత ధైర్యము లేకుండుటకు ఎన్నియో కారణములుండెడివి. నీవో, తయారయిన వస్తువవు. బయలుదేరి రమ్ము.

"శ్రీరామచంద్రుడు దక్షిణదేశమున సంచరించుచుండినపు డొకానొక పర్వతముమీద చాతుర్మాస్యవ్రతావలంబనమునకు బూనుకొనెను. అచట నొక శివాలయమే యుండెను. ఆ శివుని యనుమతికొఱకై లక్ష్మణుని శ్రీరామచంద్రు డాయనయొద్దకు బంపెను. శివుడు మౌనమును వహించి కొంతసేపటికి మూర్త్యంతరమును దాల్చెను. ఆ మూర్తి నృత్యము చేయుచున్నట్లు కనిపించెను. అది స్వలింగమును స్వవక్త్రమునందుంచుకొని నృత్యము చేయుచున్నట్లున్న మూర్తి. ఈ విచిత్ర దృశ్యమును జూచి శ్రీరామచంద్రుని జేరి లక్ష్మణుడు తాను జూచినది చూచినట్లే వివరించి చెప్పెను. అది విని శ్రీరామచంద్రుడు ఆనందమును బ్రకటించెను. లక్ష్మణుడు శ్రీరామచంద్రుని జూచి 'ప్రభూ! ఇది యేటి దృశ్యమో నా కేమియు నవగాహన కావుటలేదు' అని విస్మయమును వెలిబుచ్చెను. అందులకు శ్రీరామచంద్రుడు 'లక్ష్మణా! శివుడు తన సమ్మతిని దెలిపియున్నాడు. ఆ నృత్యము నర్థ మిది: 'జిహ్వోపస్థములను సంయమము చేయగలిగి నచో నీ వెందున్నను ఆనందముతో నుండగలవు.' అనుట" — ఈ కథను నేను చిన్ననాడే యొకానొక సాధువునొద్ద వినియున్నాను. ఇపుడు దాని ననుభవించుచున్నాను. ఇక వ్రాయవలయున దేది? నీవు రమ్ము. నీవు వచ్చునట్లయిన ప్రయాణపు ఖర్చులు పంపించెదను దేవి తలచినట్లే జరుగగలదు.

నా శుభాకాంక్షలు,

ఇట్లు,

శ్రీ తురీయానంద



# చెన్నపురి శ్రీరామకృష్ణమఠమున

# శ్రీ మాతృదేవి శ్రీ శ్రీ శారదామణిదేవి

## శతవార్షిక జన్మదినోత్సవము

చెన్నపురి శ్రీ రామకృష్ణ మఠమున శ్రీ మాతృదేవి శ్రీ శ్రీ శారదామణిదేవి శతవార్షిక జన్మదినోత్సవ తిథిపూజ 8-12-52 తేది సోమవారము ఉదయము 8 ఘంటలు మొదలు 11 ఘంటలవఱకు జరుపబడెను. ప్రార్థనయందును భజనయందును ఎందఱో స్త్రీ పురుషులు పాలుపుచ్చుకొనిరి. 11 ఘంటలకు హోమము జరుపబడినది. హోమానంతరము సుమారు 500 భక్తులకు అన్నప్రసాదము పెట్టబడినది. నాడు తిథిపూజ జయప్రదముగ ముగిసినది.

14-12-52 ఆదివారము సాయంత్రము చెన్నపురి శ్రీరామకృష్ణమఠమున బహిరంగోత్సవము జరుపబడినది. ఈ కార్యనిర్వాహకురాండ్రు శ్రీమతి డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డిగారు, సోదరి ఆర్. ఎస్. సుబ్బులక్ష్మమ్మగారు, శ్రీమతి ఎస్. అంబుజమ్మాళ్ గారు కార్యక్రమమును జయప్రదముగా కొనసాగించిరి.

నాటి సభకు గౌరవనీయులు మద్రాసు ప్రధాని శ్రీ శ్రీ రాజగోపాలాచారిగారి పుత్రికారత్నము శ్రీమతి నామగిరిఅమ్మాళ్ గారు అధ్యక్షతవహించిరి.

ఇట్టి సభలయందు అధ్యక్షతవహించుటకు తన కిదియే ప్రథమమనియు నిట్టి మహాపావనజీవి శ్రీ శ్రీ మాతృదేవి జన్మదినోత్సవమును జరుపుట మన కెల్లరకు—ముఖ్యముగా స్త్రీ సముదాయమునకు—విశేషకల్యాణప్రదమనియు వచించి, తాము చెప్పవలసిన విషయమును అంతిమోపన్యాసమున జెప్పగలనని ప్రారంభోపన్యాసమును ముగించి శ్రీవారు శ్రీ శ్రీ గౌరవనీయులు విద్యామంత్రి శ్రీ ఎం. వి. కృష్ణరావుగారి సతీమణి శ్రీమతి రాజేశ్వరి కృష్ణరావు, బి. ఏ. గారిని ఆంధ్రమున నుపన్యసింపగోరిరి.

శ్రీమతి రాజేశ్వరీ కృష్ణరావు, బి. ఏ. గారిట్లుపన్యసించిరి: శ్రీ మాతృదేవి జీవితము పవిత్రమైనది. ఆమె జీవితమును లక్ష్యముగా నుంచుకొన్నచో మనము—స్త్రీజనాంగము—నిత్యజీవనమునకు నూతన తేజస్సును కల్పించుకొనగలము. సంసారమును త్యజించి స్త్రీ పురుషులు ఏ అడవులకో చెట్లకో గుట్లకో వెళ్లనవసరములేకయే మానవులు తమ జీవితమున ఆధ్యాత్మిక సోపానములు నిర్మించుకొనవచ్చును అని శ్రీ శారదామణీ గురుదేవుల దాంపత్యము లోకమునకు జాటుచున్నది. శ్రీ గురుదేవుడును శ్రీ శారదామణియు తమ తమ కర్తవ్యముల నతిబాల్యముననే గ్రహించి యున్నట్లు తెలియుచున్నది. గదాధరనామమున పెరుగుచున్న శ్రీ గురుదేవుడు 'పొట్టకూటి' చదువును విడిచిపెట్టి, అలక్ష్యముచేసి,

రాణి రాస్మణి కట్టించిన శ్రీ దక్షిణేశ్వర దేవాలయమున దేవీపూజలయందు నిమగ్నులై యుండిరి.

ఆ సమయమున శ్రీవారి భక్త్యున్మాదావస్థను జూచినవారెల్లరు ఆయనకు మతిపోయినదనియు ఆయన వట్టి పిచ్చివాడనియు నెన్నెన్నో విధముల తమలో దాము తలపోయుచుండిరి. ఈ జనవాక్యము కర్ణాకర్ణిగ శ్రీవారి తల్లి చంద్రమణీదేవికి తెలిసెను. ఆమె 'నా ముద్దుల బిడ్డడు పిచ్చివాడై పోవుచున్నాడా? అతని పిచ్చి కుదుర్చు నుపాయము లేదా!' అని తనలో వితర్కించుకొని కుమారుని ఇంటికి రప్పించుకొనెను. ప్రజలు అనుకున్నంతగా తనకుమారుడున్మత్తుడు కాలేదని ఆమె గ్రహించినది. అయినను 'నలుగుఱితో నారాయణా' అన్నట్లు పెండ్లి చేసినచో ఆయన విపరీత మనోపరిస్థితి పరివర్తితము కాగలదన్న నమ్మకమువలన తన పెద్దకుమారునకు తన ఆశయమును దెలిపెను.

అన్నయు తగుసంబంధముకొఱకు ఎంతో ప్రయత్నించెను. కాని బీదకుటుంబము కావుటవలన నాటి సంఘమర్యాద ననుసరించి కన్యాశుల్కము నిచ్చుకొనలేకపోవుటచే నెట్టి సంబంధమును స్థిరపరుపలేకపోయెను. అందువలన తల్లియు నన్నయు దిగులుపడుటవలన వారి వ్యాకులమును పరిహరింపదలంచిన శ్రీ గురుదేవుడు వారినిజూచి యిట్లు పలికెను: 'అమ్మా! మీరు నాకొఱకు బెంగపెట్టుకొనవలదు. జయరాంబటియందు శారదామణి యను బాలిక నాకొఱకు పుట్టియున్నది. మీరా సంబంధమును స్థిరపఱచుడు.'

ఈ మాటలు విన్నంతనే సంతోషముతో అన్న ఆ సంబంధమును గుదిర్చి అయిదేండ్ల శారదామణిదేవికిని శ్రీ గురుదేవునకును వివాహము చేయించెను. కాని గురుదేవుడు ఎంతో కాలము ఇంటనుండక మరల దక్షిణేశ్వరమునకు బయలుదేరిపోయెను. కొంతకాలమునకు గురుదేవుడు పిచ్చివాడై యున్నట్లు జనవాక్యమును విని శ్రీ శ్రీ శారదామణి తన భర్తృపాదముల సన్నిధికిబోయి ఆయనకు సేవలు చేసికొనవలయునని సంకల్పించెను. కాబట్టి తనతండ్రితో కలిసి ఆమె దక్షిణేశ్వరమునకు పయనమయ్యెను. కాని ఇచ్చట ఆమెయొక్క మనోవృత్తి ఎదుటివారి మనస్సు మార్పగలిగిన సంఘటన యొకటి జరిగెను.

ఒక దొంగ పత్నీసమేతముగ శ్రీ శారదామణిని జేరగా వారినిజూచి, 'అమ్మా, నాయనా, మీ అల్లుడు దక్షిణేశ్వరమున నున్నాడు. మీ కొమార్తెను నేను ఒంటరిగా వెళ్ళుచున్నాను. మీరు దక్షిణేశ్వరము వచ్చి మీ అల్లుని జూతురు రండు. ఆయన మీకు చేయవలసిన యుపచారములు చేయగలరు' అని వారితో బలికెను. ఆమె మాటలకు—ఆహృదయపూరితమయిన ఆపలుకులకు—దొంగలుగూడ తమవృత్తిని మఱచి శ్రీ శ్రీ శారదామణిదేవిని తమ కూతుగా భావించి ఆమెను దక్షిణేశ్వరము చేర్చిరి. ఇట్టి సంఘటనలనేకములు గలవు శ్రీవారి జీవితమున.

శ్రీ శ్రీ శారదామణిదేవి శ్రీ గురుదేవుని జేరినంతనే అందరు సన్న్యాసులవలె ఆయన స్త్రీనిరసనగావింపక తన ధర్మపత్నికి సాదరముగ స్వాగతమిచ్చి ఆమె ఎంతో సంతోషించునట్లు చేసిరి. ఆమెయు తనభర్త పిచ్చివాడు కాడనియు, లోకులు కాకులనియు తలంచి, ఆధ్యాత్మికరంగమున తనప్రాణనాథునకు తగిన సహచరియై సమస్తకార్యములను నిర్వహిం

చెను. సాంసారిక మార్గమున పతనహేతుకము లగు పథములను వదలి ఆమె శ్రీ గురుదేవునితో చేతులు కలిపి జీవనమును కొనసాగించెను.

శ్రీ గురుదేవుడును భర్తృత్వధర్మమును చక్కగా నిర్వహించెను. శ్రీ శ్రీ శారదామణియందు ఏలాటి కోర్కెలు మిగిలిపోకుండ జాగ్రతవహించెను. ఆ కోర్కెలవలన ఆమె ఆధ్యాత్మిక జీవనమున కాటంకము కలుగునేమో యని 'నగలు కావలయు' నన్నపుడు దాదాపు మూడువందలరూపాయల నగలను చేయించి వేసెను. ఆమెను మాతృరూపమున బూజించి తనయందలి ఆధ్యాత్మికశక్తి ఆమెయందు ప్రవేశించునట్లు కావించెను.

ఇట్లు శ్రీవారిరువురు ఆదర్శజీవనమును లోకమునకు జాటియున్నారు. ఇందువలన భార్య ఆధ్యాత్మిక జీవితమున కాటంకమని ఆమెను చెట్లగలుపుట భావ్యముకాదనియు, గృహస్థాశ్రమమున నున్నను దంపతులు శ్రీవారివలె దివ్యదాంపత్యము కొనసాగింపవచ్చుననియు శ్రీవారు లోకమునకు జాటియున్నారు.

సర్వసాధారణముగా మన కుటుంబముల యందువలెనే శ్రీ శ్రీ శారదామణిదేవియు ఎంతో బాధ్యత వహించి రాఘువంటివారు పెట్టిన మానసిక బాధలకు ఓర్చుకొనియుండెను. కాని అవసానదశయందు మాత్రము సమస్తమును తన హృదయఫలకమునుండి తుడిచి వైచి హృదయమును స్వచ్ఛము గావించుకొనెను.

ఇట్లు శ్రీవారు స్త్రీలకేమి, పురుషులకేమి— సంఘమునకు—జూపిన మార్గము లెన్నియో గలవు. అట్టి పవిత్ర మాతృదేవి శ్రీ శ్రీ శారదామణి శతవార్షిక జన్మదినోత్సవమున పాల్గొన్న మనము ఏకొంతవఱకయినను ఆ తల్లిని అనుకరింప బ్రయత్నింపవలయును.

ఇట్టి సమయమున శ్రీవారు ఎన్నోవిషయములను శ్రీ శారదామణిదేవి జీవితచరిత్ర నుండి చదివి వినిపించిరి.

తదుపరి శ్రీమతి శ్రీ టి. ఎన్. అనంతనాయకి, బి. ఏ., బి. ఎల్. గారు తమిళమున నిట్లుపన్యసించిరి :

ప్రపంచమునందలి మతములన్నింటికిని ప్రవక్తలు—మతకర్తలు—గలరు. వారి వారి నామములతోడనే ఆ మతములు వెలయుచున్నవి. క్రీస్తు ప్రవచించిన మతము క్రైస్తవమతమనియు, బుద్ధుడు ప్రవచించిన మతము బౌద్ధమతమనియు, జినుడు ప్రవచించిన మతము జైనమతమనియు— నిట్లు ప్రపంచమున మతములు వెలసియున్నవి. కాని హిందూమతమును ఎవరు బోధించిరి, ఎవరు ప్రవచించిరి. దీనికి స్థాపకు లెవరు అన్న ప్రశ్నకు జవాబులేదు. అది సనాతనమతమని పేర్కొనబడుచున్నది. అనగా అనాదినుండియు నున్న మతమని అర్థము. ఈ హిందూమతము సమస్తమతములను తనగర్భమునం దిముడ్చుకొనియున్నది. క్రీస్తుమతధర్మములేమి, బౌద్ధమతధర్మములేమి, జైనమతధర్మములేమి హిందూమతధర్మాంతర్భాగములై వెలయుటయే యిందులకు ముఖ్యకారణము. అట్టి హిందూమతమునందు అంతర్భాగము లెన్నో కలవు. అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము మున్నగునవన్నియు హిందూమతాంతర్భాగములే.

ఇందు గల సాంప్రదాయము లన్నింటియందును 'ప్రతీకోపాసన' విగ్రహారాధన యనునది ఒకానొక విశిష్టసంప్రదాయము. ఈ విగ్రహారాధనను ఇతరమతస్థులు నిరసించుచుందురు.

కాని ప్రతి హిందువును తాను పూజించుచున్నది శిలామాత్రమని గుర్తింపక పోలేదు. కాని శిలాభావముతో వాడు పూజించుచున్నాడా అన్న విషయమే గమనింపదగిన విషయము. ‘బిడ్డకు ఏనుగును (కొయ్యబొమ్మను) చేయించిన తల్లిదండ్రులు ఏనుగు విగ్రహమును పరిశీలించినపుడు ఏనుగును నిజమైన ఏనుగుగనే భావించి దాని అంగములన్నియు సరిపడియున్నవా యని చూచిరి. అట్లే కొయ్యను పరిశీలించినపుడా ఏనుగును మఱచి ఆ వృక్ష లక్షణములన్నియు సరిపడియున్నవా యని పరిశీలించిరి.’ ఇదియే విగ్రహారాధనయందు మనము పూనవలయు మనోభావము. ఈ విషయమునే

వివేకానందస్వాములవారు రామనాథపురపు రాజునకు సుస్పష్టము గావించిరి. విగ్రహారాధనమున నమ్మకములేని రామనాథపురపు రాజు ఆస్థానమునందలి ఒకానొక ఫోటోను దీసి ‘ఇది ఎవరి ఛాయాచిత్ర’మని యడిగిరి. ‘అది మా తండ్రిగారిది’ అని రాజు జవాబిచ్చెను. అపుడు ‘రాజా దీనిమీద నుమియు’మని శ్రీ స్వామివారానతిచ్చిరి. ‘ఆహా! నా తండ్రిని అవమానము చేయుటయా? నేనుమియజాల’నని రాజు భయమును సంకోచమును జూపెను. అట్టి భావముతోడనే హిందువులు ప్రతీకోపాసనము నాచరించుచున్నారని స్వామివారు బోధించిరి.

‘ట హిందూమతమునందు అర్చనావిధానములు ఎన్నోతరగతులుగ విభజింపబడియున్నవి. ప్రతివారు తమ తమ శారీరక మానసిక శక్తుల ననుసరించి ఈ విషయమున ప్రవర్తింపవచ్చును. కాళికి మహిషమును బలి యిచ్చువారును, నారికేళాది ఫలముల నర్పించువారును, మానసికముగ నర్చించువారును ‘దేవి’ని దేవిగనే ఆరాధింతురు. ఇదియే హిందూమతమున గల వివిధశాఖాసమైక్యత.

ఇట్టి పవిత్రమతమున జన్మించిన శ్రీ శ్రీ శారదామణిదేవియు శ్రీ గురుదేవుడును సర్వమతసామరస్యమునకు దారితీయుచున్న హిందూమతమును ఆదర్శపూర్వకముగ బోధించిరి.

పిదప శ్రీమతి కమలాసుబ్రహ్మణ్యాం, బి. ఏ. గారు ఆంగ్లమున నుపన్యసించిరి. వీరును పై భావములనే విపులముగ వివరించిరి.

ఆ పిమ్మట వక్తృత్వపోటీపరీక్షలయందు పాల్గొని విజయమునందిన బాలికామణులు తమ వక్తృత్వములతో సభ్యులనెల్ల సంతోషపెట్టిరి. వారికి బహుమతులు పంచిపెట్టబడిన యనంతరము అధ్యక్షోపన్యాసము జరిగినది. అందు శ్రీవారిట్లు వచించిరి: మనమెల్లరము స్త్రీలోకమునకు మార్గదర్శినియై, ఆదర్శజీవితమును గడిపిన శ్రీ శ్రీ శారదామణిదేవివలె జీవింప సంకల్పింపవలయును. సమస్తాశయములను జయప్రదము కావించుకొనలేకపోయినను ఏ ఒక్క ఆశయమైనను నీడేర్చుకొన్నచో మన జన్మ ఎంతో తరింపగలదు. ఇట్టి పావనుల జన్మదినోత్సవములు మనకు కొంతవరకైనను మానసిక పరిణామమును చేకూర్చగలవు.

చిట్టచివర శ్రీ శ్రీ డాక్టర్ ముత్తులక్ష్మి రెడ్డిగారి అభివందనములతో సభ ముగిసెను. శారదా విద్యాలయ బాలికామణుల మంగళ గానములు మతమును ప్రశాంతమొనర్చెను.



చెన్నపురి శ్రీరామకృష్ణమఠమునకు

# శ్రీరామకృష్ణమఠ సేవాసంఘ సర్వాధ్యక్షులు పూజ్యపాదులు

# శ్రీమత్ శంకరానందస్వాములవారి ఆగమనము

రామకృష్ణమఠ సేవాసంఘముల సర్వాధ్యక్షులు పూజ్యపాదులు శ్రీమత్ శంకరానందస్వాములవారు బేలూరుమఠమునుండి బయలుదేరి నాగపూరు జేరి అచటి నుండి బొంబాయి నగరమునకు వెళ్లిరి. ఎందఱో భక్తులు హృదయపూర్వకముగ విన్నవించుకొనుటవలన వారి ప్రార్థనల మన్నించి బొంబాయినుండి 28-12-1952 న శ్రీవారు చెన్నపురికి విజయము చేసిరి. నాడు శ్రీ రామకృష్ణమఠమునందలి స్వాముల వారలు, పురప్రముఖులు, భక్తులు—అనేకులు మద్రాసు సెంట్రలు స్టేషనునకు బోయి శ్రీవారికి స్వాగతమొసగి మఠమునకు దోడ్కొనివచ్చిరి.

శ్రీ రామకృష్ణ పరమహంసదేవునకు మానసపుత్రుడని ఖ్యాతిగాంచిన శ్రీమత్ బ్రహ్మానందస్వాములవారికి సాక్షాత్ శిష్యులు శ్రీవారు. వీరు 1951 వ సంవత్సరము మే మాసమున శ్రీ రామకృష్ణమఠసేవాసంఘములకు సర్వాధ్యక్షులయిరి. ఇది శ్రీవారి ద్వితీయాగమనము. శ్రీవారు ప్రప్రథమమున 1902 వ సంవత్సరము డిశంబరు మాసమున చెన్నపురికి విజయము చేసిరి. ఇపుడు తమ డెబ్బదిరెండవయేట మఱల చెన్నపురిని పవిత్రము గావించిరి.

శ్రీవారు మఠమున నుండగా వేలకొలది భక్తులు ప్రతిదినమును వచ్చి శ్రీవారి దర్శనమును ఆశీర్వాదములను బడసిరి. సరాసరి దినమునకు రెండువందల కెక్కుడు భక్తులు మఠమునకు శ్రీవారి దర్శనార్థము వచ్చి ఆశీస్సుల బడయుచుండిరి. శ్రీవారు రమారమి ఎనుబదుగురకెక్కుడు భక్తులకు మంత్రదీక్ష నొసగిరి.

7-1-1953 నాడు మఠమున జరిగిన శ్రీమత్ వివేకానందస్వాములవారి జన్మతిథి పూజయందును, 11-1-1953 నాడు జరిగిన బహిరంగోత్సవమునందును పాల్గొని వారు కార్యమును జయప్రదము గావించిరి.

భక్తులకును, ముముక్షువులకును, శిష్యులకును ఆశీర్వాదములు, హితోపదేశములు నొసగి శ్రీవారు చెన్నపురినుండి 12-1-1953 న బయలుదేరి భువనేశ్వరముమీదుగా బేలూరుమఠమునకు వేంచేసిరి.



# శ్రీమద్భగవద్గీత

శ్రీ నిర్వికల్పానందస్వామిచే అనువదింపబడినది. ప్రతిపదార్థ టీకాతాత్పర్య శ్రీధరీయ టీకాసార విశేషాంశ సహితము. గీతా తత్త్వమను వివరణ ప్రాయమగు వ్యాసరాజముతో నలరారుచున్నది.

...ఇందలి పాద దీపికలన్నియు అమృతబిందువులు.

—వేలూరి శివరామశాస్త్రి

...కడు సుందరమై విశేషార్థమందరమై యున్నది.

—ఆంధ్రప్రభ

424 పుటలు — వెల : రూ. 3-0-0

# శ్రీ బ్రహ్మానందబోధనలు

(శ్రీ బ్రహ్మానందస్వామి జీవితోపదేశములు)

గ్రంథకర్తయు అనువాదకర్తయు: శ్రీ చిరంతనానందస్వామి

త్రివర్ణముఖచిత్రము శ్రీ రామకృష్ణబ్రహ్మానందస్వాముల ఛాయాచిత్రములు గలవు.

భక్తులకును సాధకులకును కల్పతరువువంటిది. ఆధ్యాత్మిక జీవనరంగమున సాధకులు అనుసరింపవలయు మార్గములన్నియు నిందు విపులముగ వివరింపబడియున్నవి.

జీవితభాగమున శ్రీ రామకృష్ణమానసపుత్రుడగు శ్రీ బ్రహ్మానందస్వాములవారి వ్యక్తిత్వము, ప్రతిభాతిశయము, నిరంతరభగవదనుసంధానదీక్ష, లోకసంగ్రహాకర్మాచరణము, శిష్యశిక్షణము మున్నగు నంశములు తేటతెల్లముగ రచింపబడియున్నవి.

ఉపదేశభాగమున భగవదస్తిత్వము, భగవదన్వేషణము, ఆత్మసమర్పణము, పూజాధ్యానములు, నామస్మరణము, మంత్రోపదేశము, జపము, తపము, కుండలినీప్రబోధము, సాధనాంతరాయనిరోధనము, మనోనిగ్రహము, సాక్షాత్కారము మున్నగు విషయములు మృదుమధురమై శ్రావ్యమై రసోచితమయిన భాషయందు గురుశిష్య సంవాద రూపమున అనువదింపబడియున్నవి.

ఈ గ్రంథపఠనమున భక్తులును సాధకులును సంపూర్ణఫలమునందగలరనుట నిశ్చయము!

344 పుటలు — ప్రజ్వలమగు ప్రథమముద్రణము : గ్లేజు కాగితములు. వెల : రూ. 3_8_0

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ లీలామృతము

496 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము! రూ. 5–0–0

## బ్రహ్మానంద బోధనలు

344 పుటలు ప్రజ్వలమగు ప్రథమ ముద్రణము! రూ. 3–8–0

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

**540 పుటలు** సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3–4–0

## శ్రీ మద్భగవద్గీత

**480 పుటలు** శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3–0–0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

**432 పుటలు** పండిత పామర రంజకమైన శైలి. అందమగు 6-వ కూర్పు రూ. 3–0–0

## శ్రీ శారదాదేవి చరిత్ర

**256 పుటలు** ఇంటింటను ఉండతగిన దివ్యగ్రంథము. ముద్దులొలుకు రెండవ కూర్పు వెల రూ. 1–12–0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

**186 పుటలు** (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1–4–0

| | | | | |
|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 |
| చికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| గురూపదేశములు | | ... | | 0 | 8 | 0 |
| నాసంస్కారణ యుద్ధవిధానము | | ... | | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | | ... | | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | | ... | | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | | ... | | 0 | 8 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | 0 | 8 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | | ... | | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | | ... | | 0 | 1 | 0 |
| నా మతము | 0 0 6 | | డజను | 0 | 5 | 0 |
| సింహ గర్జన | 0 0 6 | | డజను | 0 | 5 | 0 |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాస పత్రికలును మావద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
—శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 16-1-53.